గోదావరి పుష్కరాలు – 1991

# రాజమండ్రి చరిత్ర



ప్రచురణ :

కమీషనర్ సమాచార, పౌర సంబంధ శాఖ,

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు

తొలి ముద్రణ : 1991

ఫొటోలు : ఎం. బాబులు

ముఖచిత్రం :

ఆదికవి నన్నయ (చిత్రం : శీలా వీర్రాజు)

రెండవ కవరు :

బావివద్ద – దామెర్ల రామారావు వర్ణచిత్రం

మూడవ కవరు :

సీమంతం – దామెర్ల రామారావు వర్ణచిత్రం

నాల్గవ కవరు :

ధవళేశ్వరం కాటన్ బ్యారేజ్

వెల : రూ. 2.00

గోదావరి పుష్కర ప్రచురణ

# విషయసూచిక

# చిత్తగించండి!

జీవితం జీవనది. జీవనదిలా నిండుగా గంభీరంగా, గల గలా చైతన్యంతో.. కదలాలి కదిలించాలి.

జనజీవనంలో ఉగాదిలా

జీవనదికో పుష్కరం!

ఉగాది నవ వసంతానికి నాంది అయినట్టే,

పుష్కరం–

నదీతీరంలో జనజీవన సంస్కృతీ చైతన్యానికి పునరుజ్జీవనం

గంగా, భాగీరథీ తదాదిగా పుణ్యగౌతమి వరకు జీవనదులన్నీ, విభిన్న భాషా సంస్కృతుల్నీ, వివిధమతానుయాయుల్నీ భావ సమైక్య లతలతో పెనవేసి, "భిన్నత్వంలో ఏకత్వాన్ని" సంతరిస్తున్నాయి.

"నదీనాం సాగరోగతిః" అన్నట్లు ఇన్ని భాషా సంస్కృతీ సంప్రదాయాలు జాతీయతకు అంకితమౌతున్నాయి.

వేణువులా, వెన్నెలల్లా, అలలమధ్య అరుణోదయంలా, తెలి మబ్బులలో తెమ్మెరలా, అచ్చంగా గోదావరి కోటి జీవాలకు అమ్మ లాంటిది

గోదావరి మా తల్లి – తెనుగు కళా సాహితీ కల్పవల్లి

ఆ ఒడ్డున ఆదికావ్యం అవతరించింది.

ఆదికవి నన్నయగంటం ఆనాటినుంచి ఈనాటివరకు తెనుగు సాహితీ పూదోటలో శతాది కలకూజితాలకు ఊతాన్నిచ్చింది

అడివి బాపిరాజు కళాభినివేశం, కలంబలం

మునిమాణిక్యం హాస్యకథాభినివేశం

చిలకమర్తి, పానుగంటి, మొక్కపాటి కథాకథనం

సాహిత్యంలో అచలం చలం

నవరసాలొలికిన కృష్ణశాస్త్రిగళం

తిరుపతి వేంకట కవుల నిత్యచైతన్య సాహితీకదనం

ఇలా కలం తెరిచి చెప్పుకుంటే గ్రంథమౌతుంది మూసేస్తే, శతాధికంగా దొడ్డవారిని ప్రస్తావించుకోలేదే అని మనసు మూగవేతుంది

తరతరాల సాంప్రదాయ దాస్యాంధకారాన్ని ఛేదించిన తరం మనది అంటూ వ్యవస్థలో రుగ్మతల్ని రూపుమాపేందుకు వజ్రాయుధంలా ఉద్యమించిన నవయుగ వైతాళికుడు కందుకూరి వీరేశలింగం బాల్యవివాహాల్ని నిరసించి, వితంతూద్వాహాలకు, స్త్రీ విద్యకు తలుపులు తెరిచాడు అవినీతి, లంచగొండితనం, దురన్యాయం వీరేశలింగం పేరు చెబితే ఉలిక్కిపడ్డాయి

పూసగుచ్చి చెప్పాలంటే గోదావరి తీరానికి సముద్ర మంతటి చరిత్ర వుంది అందుకు మూలకారణం అక్కడ జనచైతన్యం పల్లవిస్తోంది

వేదకాలం నుంచి యీనాటివరకు నిరంతరం సాగుతున్న జీవనస్రవంతికి సాంస్కృతిక ప్రతీక-గోదావరి పుష్కరాలు

చారిత్రాత్మకమైన ఈ ఘట్టంలో రాష్ట్రప్రభుత్వ సమాచార, పౌరసంబంధశాఖ తమవంతు కర్తవ్యంగా, పుష్కర ప్రాశస్త్యాన్ని, గోదావరితీర సంస్కృతిని ప్రతిబించే కొన్ని పుస్తకాలను ప్రచురిస్తున్నది పుష్కర యాత్రికులతోబాటు, సాహితీ అభిలాషగల అందరినీ అలరించాలన్న తపనతో ఆయా రంగాలలో అనుభవం పండిన పండితులచేత యీ పుస్తకాలను రాయించి, ప్రచురిస్తున్నాము ఈ కృషిలో మా శాఖతో సహకరించిన రచయితలందరికీ కృతజ్ఞతలు

భవదీయ,

**డి. మురళీకృష్ణ** ఐ ఎ యస్
కమీషనర్,
సమాచార, పౌర సంబంధ శాఖ
కార్యదర్శి (సాధారణ పరిపాలన - స పౌ సం శాఖ)

హైదరాబాద్
తేదీ : 24-6-1991



కాటన్ మ్యూజియం
ధవళేశ్వరం



శ్రీ సారంగధర ఆలయం
రాజమండ్రి

# రాజమహేంద్రిలో చారిత్రక ప్రదేశాలు

- యాతగిరి శ్రీరామ నరసింహారావు
రాజమహేంద్రి పురావస్తు త్రవ్వకాల
కార్యాచరణ సమితి కార్యదర్శి

ఆంధ్రుల సాంస్కృతిక రాజధానిగా ప్రఖ్యాతి నొందిన పట్టణం రాజమహేంద్రవరం. ఇక్కడ చారిత్రక ప్రదేశాలు అనేకం వున్నాయి ఎందరో మహానుభావులు ఈ గడ్డపై దేశ స్వతంత్ర్యం కోసం అనేక కష్టములను అనుభవించారు. చరిత్ర పుటాలలో శాశ్వత స్థానాన్ని అలంకరించారు ఆయా చారిత్రిక స్థలాల ప్రాముఖ్యాన్ని ఈతరం తెలుసుకుంటే భవిష్యత్ తరాల వారికి అందివ్వగలుగుతారు

## పాల్‌చౌక్

ఇన్నీస్ పేటలో కోటిపల్లి బస్సుస్టాండ్ ప్రాంతమే పాల్ చౌక్ 1907 లో వందేమాతరం ఉద్యమ కాలంలో నాటి ప్రఖ్యాతి దేశనాయకులైన బిపిన్ చంద్రపాల్ ఇక్కడ గంభీర ఉపన్యాసం ఇచ్చి యువతరాన్ని స్వాతంత్ర్యోధ్యమంలో పాల్గొనేటట్లు చేసింది ఆయన ఉపన్యాసాన్ని ప్రఖ్యాత సాహిత్యవేత్త శ్రీ చిలకమర్తి లక్ష్మీనరిసింహంగారు అనువాదం చేయడమే గాక భరతఖండంబు చక్కని పాడియావు" అన్న ప్రఖ్యాత పద్యాన్ని ఆశువుగా చదివారు. ఈ పద్యం ఎంతోమందిని ఉత్తేజ పరిచింది అక్కడవున్న మూడు పార్కులు వాటి ఎదురుగావున్న పెట్రోలు బంక్, బస్‌స్టాండ్, లారీస్టాండు అంతా కలిసిన ప్రాంతమే పాల్ చౌక్. ఆనాటి ముఖ్యమంత్రి, నేటి ప్రధాని అయిన శ్రీ పి వి నరిసింహారావుగారు ఈ ప్రాంతమంతా జాతీయ స్మారకస్థలంగా వుండాలని ఆదేశించారు పాల్ చౌక్ అంటే ఏమిటో తెలియనివారు అక్కడ పాలు చౌకగా దొరుకుతాయి అని చెప్పడంకూడా నేను స్వయంగా విన్నాను

## శ్రద్ధానందాఘాట్

హర్యానాకు చెందిన స్వామి శ్రద్ధానంద గొప్ప దేశభక్తుడు, త్యాగధనుడు, ఆయన పేరుతో గోదావరి గట్టున కొవ్వూరు లాంచీలరేవులో బోసు బొమ్మ ప్రాంతాన్ని శ్రద్ధానందా ఘాట్‌గా పిలిచేవారు. ఇప్పటికి అయిదు పదులు దాటిన వారికి శ్రద్ధానందాఘూట్ అంటే ఏమిటో తెలుస్తుంది.

మహామహులైన నాయకులెందరో బోసు విగ్రహం వద్ద నిలబడి ఉపన్యాసం ఇచ్చేవారు. జనులు గేలరీవలే వున్నమెట్లు మీద కూర్చుని వినేవారు. నిజానికి బహిరంగసభకు ఇంతటి చక్కని ప్రదేశం మరెక్కడా లేదు. ఆచార్య కృపలాని, ఆంధ్రకేసరి ప్రకాశం, ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావు, అపరచాణుక్య శ్రీ కళావెంకట్రావు ప్రభృతులెందరో ఇక్కడ ఉపన్యాసం ఇచ్చారు.

## సుబ్రహ్మణ్య మైదానం

మున్సిపల్ ఆఫీసు ఎదురుగా శ్రీ వెంకటేశ్వరా ఆనంకళా కేంద్రం ముందు వున్న ప్రాంత మంతా సుబ్రహ్మణ్య మై దానంగా దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన దగ్గర్నుండి పిలవ బడుతోంది రెండు పర్యాయాలు రాజమండ్రి నుంచి లోక్‌సభకు ఎన్నికైన కల్నల్ డి.ఎస్. రాజుగారు 1947, ఆగస్టు 15న సుప్రసిద్ధ దేశభక్తులు డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారి పేరిట ఈ మైదానం పిలవబడుతుందని ప్రకటించారు. అంతవరకు అది పోలీసు కవాతు మైదానంగా ఉండేది ప్రస్తుతం మున్సిపాలిటి ఆధీనంలోకి వచ్చింది. ప్రజలకందరకి బహిరంగ సభలు ఏర్పాటు చేసుకోవడానికి అనువైన స్థలంగా వుంది.

## శ్రీ వీరేశలింగం పంతులుగారి ఇల్లు

యుగపురుషులు శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమతాతగారు గోదావరి గట్టున శంకరమఠం – రాఘవేంద్రమఠం మధ్యలోవున్న వంకాయల వారి వీదిలో నిర్మించిన గృహంలో 1848 సం॥ జన్మించారు. సుదూర

ప్రాంతాల నుండి సహితం ఆసక్తి పరులెందరో భక్తితో ఈ గృహాన్ని సందర్శించి ధన్యులైనట్లు అభిప్రాయ పడుతూవుంటారు. ఇది ఒక యాత్రా స్థలంగా మారింది. ప్రస్తుతం రాష్ట్ర పురావస్తు శాఖ ఈ గృహ సంరక్షణ బాధ్యతను స్వీకరించింది. ఆయనకు సంబంధించిన వస్తువులలో (పడక్కుకుర్చీ, చేతికర్ర, పట్టుబట్ట, లాంతరు, ఫోటోలు, ఉత్తరాలు వంటివి) ఒక మ్యూజియంను ఇందులో నెలకొల్పాలని ఆశాఖ ఆశయం. ఆయన ఉపయోగించిన ప్రింటింగ్ మిషన్ ప్రస్తుతం సమాచారం దినపత్రిక వారివద్ద వున్నది. ఆ దినపత్రిక సంపాదకులు శ్రీ గంధం సీతారామాంజనేయులు కోరిక మేరకు వారిపుత్రులు దానిని ఈ గృహంలో వుంచుటకు ముందుకు వచ్చారు. ఈ భవనానికి ఆనుకునే వీరేశలింగంగారి భార్య శ్రీమతి రాజ్యలక్ష్మిగారి పేరుతో ఒక భవనం వున్నది. ఇందులో ఆమె స్త్రీలకు ప్రత్యేకంగా ప్రార్థనాసమాజాన్ని, పఠనాలయాన్ని నిర్వహించేవారు.

టౌన్‌హాలు

వీరేశలింగంగారు తమ సొంత ధనంతో ప్రజల ఉపయోగార్థం 1890లో ఆంధ్రదేశంలో మొట్టమొదటి పురమందిరాన్ని నిర్మించారు. అందులో మహాత్మాగాంధీ, రవీంద్రనాద్ టాగూర్, మోతీలాల్ నెహ్రూ, జవహర్‌లాల్ నెహ్రూ , బిపిన్ చంద్రపాల్, అనిబిసెంట్, టంగుటూరి ప్రకాశం పంతులు, విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ శ్రీ ప్రభృతులు ఎందరో ప్రసంగాలు చేశారు. ఈ చారిత్రిక కట్టడం హిందూ, ముస్లిం, యూరోపియన్ సంస్కృతుల చిహ్నంగా నిర్మించబడింది. 720 చ.గ. ఆవరణలోని ఈ ప్రదేశాన్ని రక్షిత కట్టడంగా రాష్ట్ర పురావస్తుశాఖ గుర్తించి ఈ ప్రాచీన భవన పరిరక్షణ బాధ్యతను స్వీకరిస్తోంది. ఆర్థిక సహాయంచేసి భవన పరిరక్షణకు పూనుకోవాలని నిర్ణయించింది. త్వరలో ఈ టౌన్‌హాల్ శతవార్షికోత్సవం జరుగనున్నది. ఇందులో లైబ్రరీ, రీడింగ్‌రూమ్, టేబుల్ టెన్నీస్, చదరంగం, సభానాటక కార్యక్రమాలు జరుగుచున్నవి. ఆదికవి నన్నయ, మహాకవి శ్రీనాధుడు

తైలవర్ణ చిత్రాలను ఇక్కడ చూడవచ్చు..

## ఆనందోద్యానవనం

వీరేశలింగంగారు సంపాదించిన తోటలో ప్రస్తుతం శ్రీమతి రాజ్యలక్ష్మి స్త్రీలకళాశాల, ఆయన నిర్మించిన కళ్యాణమండపం, ఆయన భార్య చనిపోయిన ఇల్లు, వీరేశలింగం దంపతుల సమాధులు, సంఘసంస్కర్త దేశ రాజు పెద బాపయ్య గారి సమాధి, స్త్రీల అప్పర్ కేర్ హోమ్, వీరేశలింగం ఇంగ్లీష్ మీడియం స్కూలు ఇవన్నీ ప్రస్తుతం ఎండోమెంట్లు శాఖ నిర్వహణలో వున్నాయి. తిరుపతి దేవస్థానం సహకారంతో ఆనందోద్యానవనము చక్కగా రూపొందుటకు ప్రయత్నాలు చురుకుగా జరుగుతున్నాయి.

## పెద్దమసీదు

రాజ వీధిలో ఒకప్పుడు వేణుగోపాలస్వామి దేవాలయంగా వున్న ప్రాంతాన్ని 1323లో మహమద్ వుల్లాఖాన్ ముట్టడించాడని చెబుతారు. సుమారు ఎకరం స్థలంలో పోయిన శిల్పాలు పోగా మిగిలినవి ప్రస్తుతం రాష్ట్ర పురావస్తుశాఖ పరిరక్షిస్తోంది. ప్రారంభంలోపైన పద్మం, సింహద్వారం మంచి శిల్పంతో అలరారుతోంది. ప్రక్కనున్న ద్వారపాలకులపై సిమ్మెంట్ పూత పూయబడింది. లోపల నమాజ్ చేసుకొనే స్థలంలో సుమారు 20 శిల్పమయమైన ఆలయస్తంభాలు ఈనాటికి చెక్కు చెదరకుండా వున్నాయి. ఆనాటి విగ్రహాన్ని సమీపసందులోకి ఆనాటి అర్చకులు తీసుకుని వచ్చి పూజలు కొనసాగిస్తున్నారు. తరువాత రెడ్డిరాజులు కొచ్చెర్లకోట జమ్మిందారులు తదితరులు అవసరవెంబడి దేవాలయాన్ని పునర్నిర్మించారు. ఈ క్షేత్ర పాలకుడు శ్రీ వేణుగోపాలస్వామి.

## శ్రీ ముకుందేశ్వర ఆలయం

హోటల్ మహాలక్ష్మికి ఎదురుగా పుష్కరకాలం క్రితం ఒక సినిమాహాలు

కోసం పునాదులు తీస్తుండగా కాకతీయుల నాటి అందమైన నంది విగ్రహం బయట పడటంతో ఆ ప్రాంత మంతా చారిత్రిక ప్రదేశంగా ప్రజలు, ప్రభుత్వం గుర్తించారు. ఆ నందిపై నున్న శాసనాన్ని బట్టి మృకుండేశ్వరునికి సమర్పించిన నందిగా భావించాలి. ఆప్రాంతంలో రాష్ట్ర పురావస్తుశాఖ ప్రజల ఆందోళ ఫలితంగా జరిపిన త్రవ్వకాలలో మృకుండేశ్వరలింగం, దేవాలయ స్థంభాలు వెండిరేకుతోవున్న ఆంజనేయ విగ్రహం, మీనాక్షి విగ్రహం తదితర పురావస్తువులెన్నో బయటపడి క్రీ॥పూ రెండో శతాబ్దానికే ఈ నగరం వున్నట్లుగా దాఖలాగా గోడబయటపడింది. కోటకు నదివైపు వుండే గుమ్మంలో ఒక భాగం చిత్రాంగి గెస్టు హౌస్‌కు సమీపంలో నేటికి వున్నది. ఈ నంది దొరికిన స్థలం వెనుక గల దిబ్బను త్రవ్వితే బౌద్ధ స్తూపం కానరాగలదని పురావస్తు శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. దంతపురిగా ప్రఖ్యాతిగాంచిన ఈ నగరానికి ఆ పేరు రావడానికి గల కారణం బుద్ధుని ధంతం ఒకటి ఈ భౌద్ధ స్తూపంలో లభించగలదన్న ఆశ కొంతమందికి లేకపోలేదు.

## శ్రీ లక్ష్మీనరసింహాలయం

కంభంవారి సత్రం సమీపంలో చిన్నసందులో నగరంలో అత్యంత ప్రాచీనమైన దేవాలయం గలదు. చాళుక్య శిల్ప సంపదతో అలరారుతున్న యీ దేవాలయం, విగ్రహంకూడా 11వ శతాబ్దినాటిదే. నాటికోట ప్రాంతంలో (గోదావరి స్టేషన్) భూమిలో లభించిన యీ దేవాలయాన్ని యధాతదంగా 1788లో ప్రస్తుతంయున్న ప్రదేశానికి తరలించారు. ఈ దేవాలయ వంశపారం పర్య ధర్మకర్తలు యాతగిరివారు.

# రాజమహేంద్రవరంలో స్వాతంత్ర్యసమర యోధులు

**వరదా బ్రహ్మానందం**

సాయంసంధ్యా సమయం. అరుణబింబార్కుడు పశ్చిమ దిశాము తల్లి వొడిలో వాల బోతున్నాడు. ఏకిన దూది పోగులలాటి మేఘాలు రక్త వర్ణరంజిత మౌతున్నాయి. గోదావరీ నదీ తీరాన శ్రద్ధానంద ఘూట్‌లో కూర్చుని గోదావరి నది లోకి చూస్తూంటే నదిమీద తేలియాడే అలలు అరుణ సింధూరంలోకి మారుతున్నాయి. ఆ అరుణ రంజిత దృశ్యాన్ని చూస్తూంటే - సుమారు రెండు శతాబ్దాలు కర్కశ బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారతదేశ సంపదని, ప్రజలని మూల్గులతో సహా రక్తమాంసాలని పీల్చి తినివేసి,దోచుకున్న చరిత్ర ఆలంబనంగా కనిపిస్తోంది. బ్రిటిష్ సామ్రాజ్య వాదుల్ని దేశంనుండి తరిమికొట్టి, భారతదేశ దాస్యవిముక్తికి పోరాడిన ప్రథమ భారత స్వాతంత్ర సమరంలో రక్తమోడ్చి, ఎనలేని ధైర్య, సాహసత్యాగాలతో ప్రాణాలర్పించిన అమరవీరులూ, ఎనలేని దేశభక్తిలో దాస్య విముక్తికి నడుంగట్టి రణరంగంలోకి దిగిన గదర్ వీరులూ, చిటగాంగ్ సమర యోధులు, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల చిత్రహింసలకు, ఉరిశిక్షలకు చిరునవ్వు మోములతో ప్రాణాలర్పించిన, ఉరి కంబా లెక్కిన అమరవీరులు లాలాలజపతిరాయ్, భగత్‌సింగ్, రాజగురు, సుకదేవ్, చంద్రశేఖర ఆజాద్, మన్యం పోరాటాల్లో బ్రిటీష్ తుపాకులకు బలైన ద్వారబంధాల చంద్రయ్య, యువకిశోరం అల్లూరి సీతారామరాజు ఇంకా ఎందరో వందలాది స్వాతంత్ర్య సమర యోదులూ లీలామాత్రంగా ఆ అరుణ తరంగాల్లో దర్శనమిస్తున్నారు.

గాంధీజీ ప్రసాదించిన అహింసా, సత్యాగ్రహ ఆయుధాలని ధరించి నరక ప్రాయాలైన జైళ్లపాలై, బ్రిటిష్‌లాఠీ దెబ్బలకి తలలుపగిలి రక్తమోడ్చి అశువు లర్పించిన వారూ తమ దరహాస వదనాలతో దర్శనమిస్తున్నారు. డా॥ బ్రహ్మ

జ్యోస్యుల సుబ్రహ్మణ్యం, ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం, శ్రీమతి దువ్వూరిసుబ్బమ్మ, మహర్షి బులుసు సాంబమూర్తి, భయంకరాచారి ఇంకా ఎందరో దర్శనమిస్తున్నారు.

స్వాతంత్ర్య భానూదయం జరిగిన అర్థసంవత్సరం నిండకుండానే - మానవోత్తముడు, జాతిపిత, దేశసమైక్యతకి, జాతి సమైక్యతకిప్రతీకగా నిలిచి, బ్రిటీష్ సింహాన్ని తన అహింసాపోరాటంతో గడగడలాడించి స్వాతంత్ర సంపాదనికి నిరంతర కృషి చేసిన అహింసామూర్తి గాంధీజీని- హిందూమత దురహంకారానికీ, మతోన్మాదానికీ ప్రతీకగా కరుడుగట్టిన కరినాత్ముడు వినాయక నాధూరాం గాడ్సే- గాంధీజీ ప్రార్థనకి వెడతూన్న సాయంసంధ్యలో రివాల్వర్‌తో నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపిన ఘోరదృశ్యం, రివాల్వర్ గుళ్లగాయాలతో గాయాల రక్తధారలతో భారతభూమిని పునీతం చేస్తూ "హేరాం, హేరాం" అంటూ బాపూజీ నేల కొరిగిన దృశ్యాన్ని వీక్షిస్తుంటే గుండెలు బ్రద్దలు అవుతున్నాయి. ఆనాటి దృశ్యాలు సజీవతతో మనస్సు ఆవరిస్తూంటే చెప్పరాని వివశత్వం, ఉద్వేగం, ఆవేదనలు కలుగుతున్నాయి.

జాతీయోద్యమంలో గోదావరినదీ తీరాన రాజమహేంద్రవరం కూడా భాగస్వామిమై గర్వించదగిన చరిత్ర సృష్టించిన ఘటనలు కళ్ళకు కట్టి గగుర్పొడుస్తోంది జాతియోద్యమ పోరాటంలో ఎందరో వీరాంగనలు పాల్గొని చరిత్రకి మరింత గర్వకారణమైనారు

1885లో జాతీయ కాంగ్రెస్ స్థాపించబడిన తదశాబ్దంలోగానే రాజమహేంద్రవరంలో శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారు రాజమహేంద్ర వరంతోబాటు తూర్పు గోదావరి జిల్లాలో జాతీయోద్యమ ప్రచారాన్ని ప్రారంభించారు. ప్రముఖ కవి శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం తమ పదునైన వాడి కవితాగానంతో ప్రజల్లో జాతీయ భావాలను నాటడం ప్రారంభించారు.

1895లో శ్రీ చిలకమర్తి వారు రచించిన పద్యాలు ప్రజలలో వేనోళ్ళపాడుకునే వారు. ఆపద్య భాగాలను కొన్నిటిని చూద్దాం.

"నేలదున్నదమన్న జాల తరము పన్ను
వాణిజ్య మొనరింప వచ్చుబడి పన్ను
సరుకులమ్ముదమన్న సంతపన్ను
కఱ్ఱలమ్ముదమన్న కలప కింకొక పన్ను
పారిపోవుదమన్న బందిపోసిల్ పన్ను
కొంపనమ్ముకొన్నచో స్టాంపు పన్ను
ఉన్నముట్టుకు తినకుండా నుప్పుపన్ను"
"తెలుగు తెలియంగా దొరలకు తెలివిలేదు
దీన దశన్ బాపంగ అట్టి దిక్కులేదు"
"భారతదేశంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై ఏడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియ బట్టి"

ఇలాగే యింకా ఎన్నో పద్యాలు గ్రామగ్రామాలకి పాకి జనాన్ని జాతీయోద్యమానికి సన్నిహితుల్ని చేశాయి.

బ్రిటిష్ సామ్రాజ్యవాదుల భారతదేశ దురాక్రమణలో భాగంగా 1769 నాటికి కోస్తా ప్రాంతం ఆంగ్లేయుల వశమైంది.

1858లో ఏజన్సీ ప్రాంతంలో బ్రిటిష్ వారిపై తిరగబడ్డ ఒక మన్యం దేశభక్తుడు వెంకటరెడ్డిని ఒక చిక్కంలో నిలువునా నిలబెట్టి మూతిబిగించి, సజీవంగా రాజమహేంద్రవరం కోటగుమ్మం దగ్గర ఒక చెట్టుకి వేలాడదీసి, కాకులకి, గెద్దలకి వదిలి పెట్టారు. ఆకలికి అలమటిస్తూ ఆయోధుడు క్రమంగా నీరసించి, కృశించి హరీమని కాకులకి గెద్దలకీ ఆహారమై అమరవీరుడైనాడు. బ్రిటిష్ వారినెదిరించిన ప్రతివారికీ ఇదే గతిపడుతుందని భయభ్రాంతుల్ని చెయ్యడానికి బ్రిటిష్ కిరాతుకులు ఇలాంటి కసాయి శిక్షలు విధించేవారు. ఆ చిక్కం చాలా కాలం రాజమండ్రి మ్యూజియంలో ప్రస్తుత మునిసిపల్

ఆఫీసులో (అస్థి పంజరాన్ని నేను చూశాను). ప్రదర్శనగా వుంచారు. దానినే వెంకటరెడ్డి సంచి అనేవారు.

1845 నుండి 1870 దాకా పలువురు జమిందార్లు బ్రిటీష్ వారిమీద సాయుధ తిరుగుబాట్లు చేశారు జమిందార్ల నాయకత్వంలోనూ, తాము స్వయంగానూ గిరిజనులు పలుచోట్ల తిరుగుబాట్లు చేశారు. మన్యం తిరుగుబాటు దారులు అనేక మంది పోలీసులను చంపివేశారు 1879-80 మధ్య గూడెంలో మూడు తిరుగుబాట్లు జరిగాయి. మన్యం ప్రజల నాయకులు ద్వారబందాల చంద్రయ్య, తాగి వీరయ్య దొర, కారిం తమ్మనదొర - ఇద్దరు పోలీసులను రెండు తుండేలుగా నరికారు. ఆ నాయకులు బ్రిటిష్ తుపాకులకు బలైనారు. రంపలో అనేక పితూరీలు జరిగాయి. పోలీసు స్టేషన్లను తగలబెట్టారు.

రాజమండ్రి పరిసరప్రాంతాలూ, మరి కొద్ది గోదావరి తీరాన దూరంలోనూ బ్రిటిష్ దోపిడీకి వ్యతిరేకంగా జరిగిన అనేక సాయుధ పోరాటాలలో అనేక మంది మన్యం వీరులు నేలకొరిగారు.

1922 ఆగస్టు 22వ తేదీని అరి వీర భయంకరుడు, యువసింహకిశోరం అల్లూరి సీతారామ రాజు బ్రిటీష్ వారికి వ్యతిరేకంగా గిరిజనులను సమీకరించి మన్యంలో సాయుధపోరాటం ప్రారంభించి రెండు సంవత్సరాలపాటు బ్రిటిష్ సామ్రాజ్య శక్తిని గడగడలాడించాడు. బ్రిటిష్ కిరాతకులు మన్యంలో సాగించిన హత్యాకాండకీ చలించిపోయి గిరిజనుల బాధలను చూసి సహించలేక స్వచ్ఛందంగా సైనికులకు లొంగిపోయాడు. పిరికి పందలు బ్రిటిష్ అధికారులు చేతికి స్వచ్ఛందంగా లొంగిన సాహస వీరుడు అల్లూరి సీతారామరాజుని నిర్దాక్షిణ్యంగా కాల్చిచంపారు.

1887లో శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులు గారిని జిల్లా ప్రతినిధిగా అఖిల భారత కాంగ్రెస్ మహాసభలకి పంపారు. 1907 నాటికి రాజమహేంద్ర వరంలో జాతీయోద్యమం బాగావేళ్లూని వందేమాతరం వుద్యమంతో తొణికిసలాడి పోయింది. వందేమాతర ఉద్యమం సందర్భంగా సుప్రసిద్ధ జాతీయ నాయకుడు శ్రీ బిపిన్ చంద్రపాల్ రాజమండ్రి వచ్చి తమ

గంభీరోపన్యాసాలతో విద్యార్థులలోనూ, జనంలోనూ జాతీయోద్యమాన్ని రగిలించారు. ఈ సందర్భంగా కాలేజి ఆంగ్ల ప్రిన్సిపాల్ ఆదేశాలను ధిఃకరించి వందేమాతరం నినాదాలు చేసి, వందేమాతరం బ్యాడ్జీలను ధరించారు. ఆ సందర్భంగా శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు తదితర 120 మంది విద్యార్థులను కాలేజీనుండి బహిష్కరించి, రెండేళ్ళు పరీక్షలకి హాజరు కాకుండా నిషేధించారు. అయినా విద్యార్థులు బెదిరిపోకుండా" వందేమాతరం"రాత్రి బడిని ప్రారంభించి చదువులను కొనసాగించారు. అలా రాజమండ్రిలోని నేషనల్ స్కూలు ప్రారంభమైంది.

1908లో శ్రీ కందుల వీర రాఘవస్వామినాయుడు, శ్రీ మామిడి దేవేంద్రుడూ అన్నయువకులు రాజమండ్రినుండి ఇంగ్లండ్ చదువుల నిమిత్తం వెళ్లారు. అక్కడ ఇండియా సొసైటి అనే విప్లవసంఘ కార్యాలయంలో మకాం పెట్టారు. అక్కడ వినాయక సావర్కార్ తదితర విప్లవవీరులతో సంబంధాలు పెట్టుకున్నారు.

1914 ఏప్రిల్‌లో ఒక సత్యాగ్రహం సందర్భంగా రాజమండ్రిలో దుకాణాలు మూసివేశారు. కాంగ్రెస్ ఏవుద్యమం ప్రారంభించినా ఇక్కడ షాపులు మూసివేయడం ఆనవాయితీ అయిందని కలక్టరు రిపోర్టు రాశాడు.

శ్రీమతి అనిబిసెంట్ హెూంరూలు వుద్యమం రాజమండ్రికి విస్తరించింది.

మొదటి ప్రపంచయుద్ధంలో సహకరిస్తే భారతదేశానికి స్వాతంత్ర్యం ఇస్తానని బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటన చేసి, యుద్ధంలో నెగ్గాక మొండి చెయ్యి చూపించింది. స్వాతంత్ర్యం అడిగితే విరగ దంతానంది. ఈ సందర్భంగా పంజాబులోని అమృత్‌సర్‌లో జలియన్‌వాలాబాగ్‌లో ప్రశాంతంగా సభ జరుపుకుంటున్న వారిపై నిర్దాక్షిణ్యంగా కాల్పులు జరిపి వందలాదిమందిని హత్య చేసింది. ఈ సంఘటన భారతదేశ ప్రజల్ని కోపోద్రిక్తుల్ని చేసింది. దేశమంతా తీవ్ర నిరసన వెల్లువలు ప్రారంభమైనాయి. బ్రిటీష్ ప్రభుత్వం ఈ సందర్భంగా రౌలత్ చట్టాన్ని విధించింది. ఆ చట్టాన్ని దిఃకరిస్తూ దేశవ్యాపితంగా జరిగిన ఉద్యమంలో భాగంగా రాజమండ్రిలో రౌలత్ చట్టాన్ని నిరసిస్తూ

షాపులు మూసి వేశారు. మునిసిపల్ చైర్మన్ శ్రీ కందుల వీరాస్వామి నాయుడు అధ్యక్షతను ఆరువేల మందితో 1919 – ఏప్రిల్ 8వ తేదీన పెద్ద బహిరంగ సభజరిగింది. శ్రీ బిపిన్ చంద్రపాల్ తమ గంభీరోపన్యాసంలో పంజాబ్ హత్యాకాండని వివరించి, భారతీయులకు సత్యాగ్రహమే శరణ్యమన్నారు. శ్రీయుతులు చిలకమర్తి లక్ష్మీనరసింహం, ఉమ్రాలీషా, అప్పన్నశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి బ్రిటీష్ ఘాతుకాన్ని ఖండిస్తూ మాట్లాడారు.

1920 అక్టోబర్‌లో ఉద్యోగాలలో సేవలు చేసినందుకు ప్రశంశా పత్రాలనందుకున్న శ్రీ జి. రామచంద్రుడు, శ్రీ మామిడి దేవేంద్రుడు – పంజాబు హత్యలకి నిరసనగా – తమ పత్రాలను కలక్టర్‌కి తిరిగి పంపివేశారు.

1920 అక్టోబరు 25న మౌల్వీ అబ్దుల్ మజీద్ అధ్యక్షతన మూడు వేలమందితో హిందూ – ముస్లింల సభ జరిగింది. సభకి సుమారు 500 మంది ముస్లిం ప్రతినిధులు వచ్చారు. గాంధీజీనాయకత్వాన జరిగే సత్యాగ్రహంలో హిందూముస్లింలు త్యాగాలకి సిద్ధంకావాలని వక్తలు ఉపన్యసించారు. ఈ సందర్భంగా సయ్యద్ హుస్సేన్ అనే వ్యాపారి నేషనల్ స్కూలుకు రు 5000 లు విరాళంయిచ్చాడు. ఖాజీ అహమ్మదుల్లాకి బ్రిటిష్ ప్రభుత్వం బహూకరించిన బంగారు పతకాన్నీ, గౌరవ మేజస్ట్రేటు పదవిని వదిలి పెట్టేశారు. అబ్దుల్ మస్జీద్ గౌరవమేజస్ట్రేటు పదవికి రాజీనామా యిచ్చారు.

రాజమండ్రిలోని దేశభక్తులు మహాత్మాగాంధీ యిచ్చిన ప్రతిపిలుపుకు స్పందించి ఉద్యమాలలో పాల్గొని ఒకసారి జైలుకి వెళ్లినవారు అనేకసార్లు వెళ్లి తమతో కూడా అనేకమంది యువకులను కదన రంగంలోకి దింపి, తమత్యాగాలతో ఇతరులను ప్రభావితం చేసి స్వాతంత్ర సమరరంగానికీ, పట్టణానికీ ఎనలేని కీర్తి తెచ్చిపెట్టారు.

అంతేగాక రాజమండ్రి సెంట్రల్ జైలులో బ్రిటిష్‌సామ్రాజ్య వాదాన్ని గడగడలాడించిన నిరుపమాన విప్లవవీరయోధులెందరో నిర్బంధంలో కఠిన కారాగార వాసం చేసి ఇక్కడి దేశభక్తులను వుత్తేజితుల్ని చేశారు. జనంలో జాతీయతని పెంపొందించారు. అలా కారాగారంలో వున్న యోధులలో

పృథ్వీసింగ్, అమరవీరులు భగత్ సింగ్ అనుచరులు రాజగురు సుకదేవ్ (వీరు ఉరితీయ బడ్డారు) విజయకుమార్ సిన్హా (అండమాన్ ఖైదీ) మరికొందరు విప్లవవీరులున్నారు.

స్థానికులేకాక దేశంలోని వివిధ ప్రాంతాలకి చెందిన దేశభక్తులకు, కేంద్రమైంది రాజమహేంద్ర నగరం. అలాంటి త్యాగధనులైన కీర్తి శేషుల జీవితాలని స్మరించుకుని ఉత్తేజంపొందుదాం.

## అల్లూరి సీతారామరాజు

బ్రిటిష్ సామ్రాజ్యవాద దోపిడీకీ, హింసా, హత్యా, దమన కాండలకి స్పందించి, గిరిజనుల్ని సంఘటిత పరిచి బ్రిటిష్ ప్రభుత్వంమీద రెండు సంవత్సరాలపాటు గడగడలాడించిన సాహసి. సీతారామరాజును పట్టుకోలేని బ్రిటిష్ అధికారులు గిరిజనులపై హత్యా, హింసా, దమన కాండలను సాగించారు. అందుకు సీతారామరాజు విలవిలలాడి గిరిజనులపై జరిగే అమానుషాన్ని ఆపడానికి ధైర్యంగా స్వచ్ఛందంగా సైనికులకు లొంగిపోయాడు. లొంగిన సీతారామరాజును నిర్దాక్షిణ్యంగా బ్రిటిష్ అధికార్లు కాల్చి చంపారు. అప్పటికి సీతారామరాజు వయసు 27 సంవత్సరాలు మాత్రమే.

## 'ఆంధ్రభీష్మ' న్యాపతి సుబ్బారావు

జననం 1889. న్యాయవాది. మద్రాసు అఖిలభారత కాంగ్రెస్ మహాసభలకి ఆహ్వాన సంఘాధ్యక్షులు. లెజిస్టేచర్ సభ్యులు, వందే మాతరం, స్వదేశీవుద్యమాలను ప్రచారం చేశారు. జాతీయ పాఠశాల స్థాపకులలో ఒకరు 1914లో ఆంధ్రమహా సభాధ్యక్షులు హిందూ పత్రికా స్థాపకులు, చింతామణి పత్రికా సంపాదకులు. "ఇండియన్ ప్రోగ్రెస్" అన్న ఆంగ్లవార పత్రికను నడిపారు 1914-17 వరకూ అఖిల భారతకాంగ్రెస్ కార్యదర్శి, సహాయ కార్యదర్శులుగా పనిచేశారు. 1941లో దివంగతు లయ్యారు.

## ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు

త్యాగానికే దేశభక్తికీ, ధైర్యసాహసాలకీ ప్రతీక. 1872లో ఒంగోలు తాలూకా వల్లూరు గ్రామంలో జననం. ఎంతో పేదరికం. అతి చిన్న వయసులో రాజమండ్రిలోని శ్రీ ఇమ్మానేని హనుమంతరావు నాయుడు గారి ఇంటికి వచ్చి - కాకతాళీయంగా తాను గోదావరినదిని దాటవలసిన నావ దాటిపోవడంతో ఇక్కడే వుండిపోయి ఆంధ్రజాతికి ధృవతారగా నిలిచి పోయాడు. రాజమండ్రిలోనే విద్యనభ్యసించి, మహానటుడుగా, మహోన్నత రాజకీయ నాయికుడుగా రూపొందాడు. మునిసిపల్ కౌన్సిలర్, మునిసిపల్ ఛైర్మన్ పదవులను నిర్వహి ంచారు. ఇంగ్లండులో బారిష్టరైనాడు. బారిష్టరుగా ఆనాటి మేధావులైన బ్రిటీష్ లాయర్లతో సహా తలదన్ని లక్షలాది రూపాయ లార్జించే తరుణంలో గాంధీజీ పిలుపు మేరకు స్వాతంత్ర్య సంగ్రామంలోకి వురికాడు. న్యాయవాద వృత్తిని తృణ ప్రాయంగా వదిలేశారు, 1925 నాటికి తాను సంపాదించిన సుమారు 25 లక్షల రూపాయల ఆస్తిని తృణ ప్రాయంగా జాతీయోద్యమానికి వినియోగించిన త్యాగధనుడు. సైమన్ కమీషన్‌కి వ్యతిరేకంగా జరిగిన ఆందోళనలో మద్రాసులో పోలీసుల తుపాకులకు గుండె నెదురొడ్డి ఎదిరించిన సాహసుడు. స్వరాజ్య, ప్రజాపత్రికలను నడిపారు. మోతీలాల్ నెహ్రూ, లాలాలజపతిరాయ్ ప్రభృతుల సమకాలికుడు. ఎన్నో సార్లు జైలు శిక్షననుభవించారు. కేంద్ర శాసనసభ్యులు. ఆంధ్రాకాంగ్రెస్ అధ్యక్షులు, మద్రాసు రాష్ట్ర రివెన్యూ శాఖమంత్రిగా, ముఖ్యమంత్రిగా పనిచేశారు. ఎందరో కుట్రలు పన్నిన ఫలితంగా ఓటములు చెందినా దృఢ చిత్తంతో చెక్కు చెదరకుండా నిలిచిన ధీరోదాత్తుడు. కొన్ని విషయాలలో గాంధీజీని ధైర్యంగా ఎదిరించి బ్రతికి బట్టకట్టి నిలబడిన సాహసోపేతుడు ఆయన. అసమాన ధైర్య, సాహస, త్యాగాలకి ఆంధ్రప్రజానీకం "ఆంధ్రకేసరిగా" గౌరవించారు. భావితరాలవారికి ఆదర్శ తార. 1957 లో కీర్తిశేషులు.

## డా॥ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం

జననం గుంటూరు జిల్లా ఫిరంగిపురం 1891. డాక్టరు వృత్తి. రాజమండ్రిలో స్థిర పడ్డారు. 1916లో కలకత్తాలో వైద్య విద్యార్థిగా వున్నపుడు హోంరూలు ఉద్యమంలో చేరారు. సామాన్య ప్రజలను ఆకట్టుకునే వక్త. ఆయన శీలం, ఆచరణాత్మకతా ప్రజల హృదయాలను స్పందింపచేశాయి. గాంధీజీ పిలుపుపై వైద్య వృత్తిని వదలి స్వాతంత్ర్య సంగ్రామ రంగంలోకి వురికారు. 1925లో దేశ ప్రఖ్యాతిగాంచిన సీతానగరంలోని గౌతమీ సత్యాగ్రహాశ్రమాన్ని స్థాపించారు. ఖద్దరు వ్యాప్తి, గ్రామోద్ధరణ, అస్పృశ్యతానివారణ, వయోజనవిద్య, మొదలైన నిర్మాణ కార్యక్రమాలను నడిపారు. ఆశ్రమంనుండి కాంగ్రెసు పత్రికను నడిపారు. ఎందరో కాంగ్రెసు కార్యకర్తలను తయారు చేశారు. కాని బ్రిటిష్ అధికారులకు కళ్లు కుట్టాయి. ఆనాడు ముష్కరుడని, నరరూపరాక్షసుడని పేరుపొందిన పోలీసు అధికారి ముస్తఫాలీఖాన్ ఆ పవిత్ర ఆశ్రమం మీద దాడి చేసి, ఆశ్రమంలోని కార్యకర్తలను చిత్ర హింసలు చేసి చితకబాదాడు. ఆశ్రమ సామాగ్రిని, ప్రింటింగ్ ప్రెస్‌ని ధ్వంసంచేశాడు. అయినా ఆ ఆశ్రమాన్ని నాశనం చెయ్యలేక పోయాడు.

1923 కాకినాడ కాంగ్రెస్ మహాసభల నిర్వహణలో మహర్షి బులుసు సాంబమూర్తిగారికి శ్రీ సుబ్రహ్మణ్యంచేదోడు వాదోడుగా ఎనలేని సహకారం అందించారు. వీరి తల్లి శ్రీమతి లక్ష్మీ నరసమ్మ గారు కుమారుడి జాతీయోద్యమానికి అండగా వుండి, ప్రచారాలు చేస్తూ 1930లో ఆశ్రమంలోనే మరణించారు. శ్రీ సుబ్రహ్మణ్యంగారి సతీమణి శ్రీమతి కామేశ్వరమ్మ భర్త వుద్యమానికి సర్వవిధాలా సహకరించారు.

శ్రీ సుబ్రహ్మణ్యం 1930లో కాకినాడ ఉప్పు సత్యాగ్రహానికి సీతానగరం ఆశ్రమంనుండి 250 మంది శాంతి దళానికి నాయకత్వం వహించి తీసు కెళ్లారు. 1932 సత్యాగ్రహంలో కర్కోటకుడు ముస్తఫాల్ ఖాన్ శ్రీ సుబ్రహ్మణ్యాన్ని గొడ్డును బాదినట్లు బాదాడు. జాతీయనినాదాలు చేస్తూ ఆ

లాఠీ దెబ్బలని భరించారు. ఆయన చనిపోయాడనే అంతా అనుకున్నారు. ప్రహ్లాదుడు హిరణ్యకశపుని చేతిలో చావలేదు. తీవ్రమైన గాయాలు తగిలాయి. ప్రక్కటెముకలు విరిగి పోయాయి. క్రమంగా తీవ్ర అనారోగ్యానికి గురైనారు. క్షయ వ్యాధి సోకింది. 1936 డిశంబరు 23 తేదీని అమరుడైనారు. విక్రమ్ హాలుఎదుట మైదానాన్ని పోలీసులు పేరేడ్ గ్రౌండ్‌గా చేసి, అక్కడ పోలీసు స్టేషన్ నిర్మించాలన్న ప్రయత్నాన్ని రాజమండ్రి ప్రజలు పోరాడి వమ్ముచేసి ఆమైదానానికి సుబ్రహ్మణ్య మైదానం అన్న పేరుపెట్టి ఆ మహాదేశభక్తుని పట్లగల ప్రేమని, గౌరవాన్ని చాటారు.

## శ్రీమతి దువ్వూరి సుబ్బమ్మ

జననం 1880. భారతస్వాతంత్ర్య సంగ్రామంలో కారాగారానికి వెళ్లిన ప్రథమ శ్రేణి మహిళామణులలో ఈమె ఒకరు. దేశస్వాతంత్ర్య సాధనకి తమ ఛాందస ఆచారాలని వదలి పెట్టి జాతీయోద్యమ కదన రంగంలోకి దూకింది. 1922 మొదటి సారి కారాగారప్రవేశం. 45వ యేట ఆమెకి వైధవ్యం వచ్చినా కార్యరంగానికి దూరంకాలేదు. ఆమె మొదటిసారి అరెస్టైనపుడు వైదికాచారంలో పెరిగిన శ్రీమతి సుబ్బమ్మ జైలు కూడు తినలేక క్షమార్పణచెప్పి వెళ్లిపోతుందని బ్రిటిష్ అధికార్లు ఆశించారు. స్వాతంత్ర్య పోరాటానికి కులమతాచారాలు అడ్డురావని స్పష్టంగా చెప్పింది. రాతమూలంగా కాకపోయినా నోటిమాటగానైనా క్షమార్పణ చెపితే విడుదల చేస్తామన్నారు. అలా నీచత్వానికి పాల్పడనని శ్రీమతి సుబ్బమ్మ గర్జించింది. శిక్షపూర్తిచేసి గాంధీజీ ఆదేశానుసారం ఖద్దరు బుజాన వేసుకుని ఆంధ్రదేశంలో జాతీయోద్యంలో ప్రచారంచేశారు. ఆమెకి భారత, రామాయణాది గ్రంథాలన్నీ కంఠస్తం. ఆమె వాగ్ధాటి సింహగర్జన. జనాకర్షనగల కంఠధ్వని. పద్యాలు చదవకుండా ఉపన్యాసం వుండేది కాదు. కాకినాడ కాంగ్రెస్ మహాసభలో ఆమెకి "దేశ బాంధవి" బిరుదు నిచ్చి సన్మానించారు. 1930 ఉప్పుసత్యాగ్రహం, 42 క్విట్ ఇండియా ఉద్యమాలలో జైలు శిక్షల ననుభవించారు. లాఠీ దెబ్బలకి గురైనారు. 1964లో తమ 84వ ఏట మరణించి, తన ఆదర్శ, సాహసోపేత నారీత్వాన్ని మనకి మిగిల్చారు.

## శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమ రావు

1883 జననం. రాజమండ్రి విద్యాభ్యాసానికి వచ్చారు. వందేమాతరం ఉద్యమానికి ఉత్తేజితులై , కాలేజి ప్రిన్సిపాల్ హంటర్ వందేమాతరం నినాదాలపై విధించిన ఆంక్షలని దిఃఖరించి, మరో 111 మంది విద్యార్థులతో సహా కాలేజీనుండి బర్తరఫ్ కాబడ్డారు. ఆ విద్యార్థులలో చాలామంది జాతీయోద్యమాలలో జైళ్ళకి వెళ్లారు. ఆయన అన్ని జాతీయోద్యమాలలోనూ పాల్గొని జైళ్ల పాలైనారు. మద్రాసులో స్కావింజర్సుయూనియన్, ప్రెస్ వర్కర్స్ యూనియన్లు స్థాపించారు. స్వరాజ్య పత్రికలో పనిచేశారు. తిరువల్వేలిలో ఆష్ అనే ఆంగ్ల మెజిస్ట్రేట్ ని యువదేశ భక్తులు కాల్చి చంపారు. యువకిశోరం చిదంబరం పిళ్ళేకు యావజ్జీవకారాగార శిక్ష విధించారు. అందుకు నిరసనగా పెద్ద ఆందోళన జరిగింది. ఓ బ్రిటిష్ పోలీసు అధికారి ఆందోళన కారులపై తుపాకులు కాల్చి ఇద్దర్ని చంపాడు. శ్రీ హరి సర్వోత్తమరావు స్వరాజ్య పత్రికలో ఒరే! ఫిరంగీ! క్రూరవ్యాఘ్రమా! ఇద్దరు భారతీయులను పొట్టపెట్టుకున్నావురా! 'అని పెద్ద శీర్షికతో వ్యాసాన్ని ముద్రించారు. అపుడాయనికి కింది కోర్టు ఆరుమాసాలు శిక్ష విధించగా ఆ శిక్ష సరిపోదని మద్రాసు హైకోర్టు జడ్జి బెన్సన్ మూడు సంవత్సరాల కఠినకారాగార శిక్షని విధించాడు. ఆయన కేసును వాదించడానికి ఏలాయరూ ముందుకు రాలేదు. కాని ఒక క్రైస్తవ లాయరు శ్రీ జె.పి. శామ్యుయేలు శ్రీ గాడిచర్ల వారియే వాదించారు. ఆయన విద్యార్థి ఫెడరేషన్ సభలకి హాజరయ్యే వారు. ప్రజలు విద్యావంతులు కానిదే చైతన్యం పెరగదని, గ్రంథాలయోద్యమాన్ని ప్రారంభించి ఆవుద్యమానికి జీవితాన్నంకితం చేసుకున్నారు. అందుకే ఆయనని గ్రంథాలయోద్యమ నిర్మాతగా పిలిచేవారు. 1960లో కీర్తి శేషులైనారు.

## శ్రీ కందుల వీర రాఘవ స్వామి నాయుడు

త్యాగశీలి నిష్కళంక దేశ భక్తుడు శ్రీ కందుల వీరరాఘవస్వామి

నాయుడు 1907 లో బారిష్టరీ చదవడానికి లండన్ వెళ్లారు. అక్కడ ప్రముఖ విప్లవకారుడు వీరవినాయక సావర్కార్, తదితర విప్లవకారులతో పరిచయం ఏర్పడింది. కొంతకాలానికి భారతదేశ విముక్తికి గాంధీజీ అహింసా సిద్ధాంతమే శరణ్యమని నమ్మి కాంగ్రెస్‌లో చేరి అన్ని వుద్యమాలలోనూ అగ్రగామిగా నిలబడి జైళ్లపాలై బ్రిటీష్ వారి నెదిరించారు. పెద్దాపురంలో జరిగిన లాఠీ చార్జిలో తీవ్రంగా గాయపడ్డారు. రాజమండ్రిమునిసిపాలిటీకి మూడు సార్లు చైర్మన్‌గా ఎన్నికైనారు. శ్రీ బిపిన్ చంద్రపాల్ రాజమండ్రి వచ్చినపుడు శ్రీ నాయుడు మునిసిపాలిటీ తరపున పౌర సన్మానం చేసి గౌరవించారు. తన ఆస్తిలో చాలా భాగాన్ని కాంగ్రెస్‌కు చెందాలని వీలు నామా రాశారు. 1945 లో కీర్తి శేషులైనారు. ఈనాడు నల్లమందు సందుగా పిలువబడేరోడ్డుకి కె.వి.ఆర్.స్వామి నాయుడు రోడ్డు అని వారి పేరుపెట్టి ప్రజలు గౌరవించారు

## శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య

1898 జననం. నిష్కపటి నిష్కళంక దేశభక్తుడు. జీవితాన్ని సోషలిస్టు ఉద్యమానికి ధారపోశారు. విద్యార్థి దశలోనే జాతీయోద్యమానికి ఆకర్షితుడైనాడు. విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజు సహాధ్యాయి. బి.ఎ. చదువుతూ విద్యకి స్వస్తి చెప్పి 1921లో శాసనోల్లంఘన ఉద్యమంలో ప్రముఖ పాత్రవహించారు. కాంగ్రెసు యువజన పత్రికకు సారధిగా, సంపాదకులుగా పనిచేసి అసంఖ్యాక యువతీయువకులను జాతీయోద్యమం వైపు మళ్లించి సోషలిస్టు భావాలను నూరిపోశారు. ఆంధ్రలో సోషలిస్టు పార్టీ నిర్మాతగా ఖ్యాతికెక్కారు. కమ్యూనిస్టులతో కలిసి నవశక్తి పత్రిక ప్రధమ సంపాదకులుగా సమర్థవంతంగా నిర్వహించారు తరువాత నేతాజీ సుభాష్ చంద్రబోస్ విధానాలకి ఆకర్షితుడై, నేతాజీకి అనుచరుడై ఆంధ్రలో ఫార్వర్డ్ బ్లాక్‌పార్టీ నిర్మాణం చేశారు. వీరి సతీమణి స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని జైలుకి వెళ్లారు. పలువుద్యమాలలో జైళ్లకి వెళ్లి 14 సం॥లు జైలు శిక్షననుభవించారు. ఆయన పేరు యువలోకానికి ఒకసమ్మోహనాస్త్రం. 1957 లో కీర్తి శేషులైనారు. జండాపంజరోడ్డు సెంటర్ లో

పార్కుకి వీరిస్మృతి చిహ్నంగా అన్నపూర్ణయ్య పార్కు అని పేరుపెట్టి గౌరవించారు.

## శ్రీ క్రొవ్విడి లింగరాజు

సుమారు అర్ధ శతాబ్దంపాటు జాతీయ వుద్యమంలో నిర్విరామకృషి చేసి ప్రాముఖ్యం వహించిన ధీరోదాత్తుడు, శ్రీ లింగరాజు మేధావిగా, పత్రికా రచయితగా, సంపాదకుడుగా, అనువాదకుడుగా, విమర్శకుడిగా వినుతికెక్కారు. ప్రజాపత్రిక, గోదావరి పత్రికల సంపాదకుడు. విదురుడు కలంపేరుతో ఎన్నో వ్యాసాలు రాశారు. తాను అనుకున్న దానిని నిర్మోహమాటంగా చెప్పేవారు. సీతానగరం ఆశ్రమ నిర్వహణలోనూ, కాంగ్రెసు పత్రికా నిర్వహణలోనూ ఎంతో చాకచక్యాన్ని చూపారు. జాతీయోద్యమాలన్నిటిలోనూ జైలు శిక్షలననుభవించారు. భారతదేశ రాజకీయ చరిత్ర ఆయనకి కరతలామలకం. ఆయన ఒక రాజకీయనిఘంటువు. ఆంధ్రకేసరి ప్రకాశంగారికి అనుంగు శిష్యులలో ఒకరు. ప్రపంచ ప్రఖ్యాతరచయిత మాక్సింగోర్కి "అమ్మ" నవలని తెలుగులోకి అనువదించారు. ఆయన అనువాదం అదివారి స్వంతరచనా అన్నట్లుంటుంది. సోవియట్ భూమి సన్మాన గ్రహీత. మద్రాసు శాసనసభా పార్లమెంటరీ కార్యదర్శిగా పనిచేశారు. రాజమండ్రి మునిసిపల్ చైర్మన్‌గా, శాసన సభ్యుడిగా ఎన్నికైనారు. తమ చమత్కారమైన ఉపన్యాసంతో శ్రోతలను ఆకట్టుకునే వారు. తన దైన ఒక స్వంతబాణీరాజకీయ పద్ధతిలో యశోవంతుడై 1986లో దివంగతులైనారు.

## శ్రీ తల్లా ప్రగడ ప్రకాశరాయుడు

జననం 1893. వీరేశలింగం హైస్కూలులో ఉపాధ్యాయులు యుగపురుషుడు కందుకూరివీరేశలింగం, శ్రీ రఘుపతి వెంకట రత్నంనాయుడు గార్లకు అతి సన్నిహితులు. నిమ్నజాత్యుద్ధరణకి ఎనలేని కృషి చేశారు. జాతీయోద్యమంలో రాయవెల్లూరు, బళ్లారి, కొవ్వూరు జైళ్లలో కారాగార

వాసం చేశారు. జీవితాంతం గాంధీజీ ఆదర్శంగా అతి నిరాడంబర జీవితంగడిపారు. శ్రీ చర్ల గణపతి శాస్త్రి, శ్రీ కాళీపట్నపు కొండయ్య గార్లు వీరికి సన్నిహితులు. దరిదాపు శతసంవత్సరాలు జీవించారు.

## శ్రీ పాలకోడేటి గురుమూర్తి

1884 జననం. సర్దార్ వల్లభాయిపటేల్ లాంటి దిట్ట. నిర్మోహమాటి. నీతి, నిజాయితీలకి మరోపేరు. వైద్యవృత్తిలో పేదసాదలకి ఎంతో సేవచేశారు. జాతీయోద్యమాలలో జైలుశిక్షలను అనుభవించి, సత్యాగ్రహాలలో లాఠీ దెబ్బలుతిన్నారు. మునిసిపల్ చైర్మన్‌గా ఆదర్శవంతంగా కృషిచేశారు. హరిజన, సహకారోద్యమాలకి వూపిరిగా సేవలు చేశారు. ఆజన్మాంతం ఆదర్శవంతంగా జీవించారు. 1984లో కీర్తి శేషులైనారు.

## శ్రీ పాలకోడేటి సూర్యప్రకాశరావు

1893 లో జననం. అకలంక దేశభక్తుడు. జాతీయోద్యమంలో అయిదుసార్లు నాగపూరు, కన్ననూరు, రాజమండ్రి జైళ్లలో కారాగారం అనుభవించారు. లారీదెబ్బలు తిన్నారు. ప్రేమజ్యోతి పత్రికా సంపాదకులు. హిందూ పత్రిక విలేఖరిగా పనిచేశారు. మునిసిపల్ కౌన్సిలర్‌గా ఎన్నికైనారు. జై ఆంధ్రావుద్యమం ముమ్మరంగా సాగుతుండగా ఆవుద్యమం తప్పనీ, సమైక్య ఆంధ్రేవుండాలనీ నిర్ద్వంద్వంగా ప్రకటించారు. దానికి కోపోద్రిక్తులైన కొందరు విద్యార్థులు ఆయన యింటికి దాడికి వెళ్లారు. ఆవార్ధక్యంలో పిరికిపడకుండా నా ప్రాణంతీసినా సమైక్య ఆంధ్రనే కొరుతానని తెగేసి చెప్పిన ధైర్యశాలి. 1976లో మరణించారు.

## డా॥ ఎ.బి. నాగేశ్వరరావు

1901లో జననం. సైనికుడు లాంటి జాతీయ యోధుడు. 1921లో జాతీయోద్యమంలో ప్రవేశం. 42దాకా రాజమండ్రి, ఆలీపూర్ జైళ్లలో వివిధ వుద్యమాలలో జైలుశిక్షలను భరించారు. ఆయనకి ఆంధ్రకేసరి ప్రకాశంగారి

మాట వేదవాక్కు. ఆయన ఆదేశానికి జవదాటలేదు. జైళ్లలో తోటి ఖైదీలని సేవాతత్పరతతో, ప్రేమతో చూసేవారు. మచ్చలేని మంచివాడు. ప్రజల ప్రేమకి ఎంతగానో పాత్రుడైనారు. మద్రాసు రాష్ట్రమంత్రి అయినా, మునిసిపల్ ఛైర్మన్‌గా ఎన్నికైనా మామూలు నాగేశ్వరరావుగానే వున్నారు. గాని భేషజాలకి పోలేదు. ఆయన రాజకీయ జీవితానికి అండగా ప్రోత్సాహంగా జాతీయవాదిగా డా॥ వంగవీటి దీక్షితులుగారు ఎంతో సహకరించారు. నాగేశ్వరరావు వ్యక్తిత్వానికీ, నిజాయితీకీ రాజమండ్రి ప్రజలు బ్రతికుండగానూ, మరణించినపుడు ఎనలేని ఆదరాభిమానాలనూ ప్రేమనీ చూపించారు.

## శ్రీ గరిమెళ్ల సత్యనారాయణ

"మాకొద్దీ తెల్లదొరతనము" అన్న పాటతో ఆంధ్రదేశమంతా మారుమోగి పోయింది. ఆబాల గోపాలం మారుమూల గ్రామాలలో కూడా ఆపాటపాడుతూ ఉత్సాహభరితులయ్యే వారంటే అతిశయోక్తికాదు. ఆయన పాటలు బ్రిటిష్ ప్రభుత్వానికి బల్లేలా తయారైనాయి. 1893లో జననం. రాజమండ్రిలో ఎల్.టి. చదువుకివచ్చి కాంగ్రెసు పిలుపు పై విద్యకి స్వస్తి చెప్పి జాతీయోద్యమంలోకి వురికి తనకవితా గళాన్నెత్తారు. ఎన్నో పాటలు రాసి జనాన్ని ఉత్తేజపరిచారు. ఉగ్రూతలూగించారు ఆయన పై పెట్టిన ఒక కేసులో రాజమండ్రి కోర్టులో "కూలి పోతున్నది, కూలిపోతున్నది ఈ మూర్ఖ బ్రిటిష్ ప్రభుత్వం" అనే పాటలోనే సమాధానమిచ్చారు. అన్ని ఉద్య మాలలోను జైళ్లలో కఠిన కారాగార శిక్షలు అనుభవించారు అంత్యదశలో కఠిన దారిద్ర్యం అనుభవించినా చెయ్యిచాచని ఆత్మాభిమాని. 1952లో కీర్తిశేషులైనారు.

## శ్రీ బారు రాజారావు

జననం 1888 వందేమాతరం ఉద్యమంలో కాలేజీనుండి బర్తరఫ్‌కాబడ్డారు. క్రమంగా అఖిల భారతకాంగ్రెస్ స్థాయికి ఎదిగారు. కాంగ్రెసులో ఆనాటి అగ్రనాయకులందరికీ తలలో నాలుకలా వుండేవారు. ప్రత్యేకించి నెహ్రూ హృదయాన్ని, ప్రేమాభిమానాలనూ మరింత చూరగొన్నారు. 1917-34

సం॥ల మధ్య అఖిల భారత కాంగ్రెసు కార్యదర్శిగా, సహాయ కార్యదర్శిగా పని చేశారు. అలహాబాదు – ఆనందభవనంలో మకాం. అనేక ఉద్యమాలలో కారాగార శిక్షననుభవించారు. మద్రాసు అసెంబ్లీ సభ్యులు. అనంతరం దివంగతులైనారు.

## డా॥ కె. ఎల్. నరసింహారావు

1899 జననం. 1921లో చదువుకి స్వస్తిచెప్పి 1922లో జాతీయోద్యమం లోకి వురికారు. బళ్లారి, కన్ననూరు తదితర జైళ్లలో కారాగారశిక్షననుభవించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. వీరి సతీమణి కూడా ఉద్యమాలలో పాల్గొని జైళ్లపాలైనారు. గర్భవతిగా వుండీ అరెస్టుకు వెరవలేదు. జైలులోనే మగబిడ్డను కన్నారు (డా॥ రామలింగశాస్త్రి) వారిది దేశభక్తకుటుంబం. యుగపురుషుడు కందుకూరి వీరేశలింగంపంతులుగారు కాంగ్రెసు సంస్థపట్ల ఎంతో ఆసక్తి చూపారు. 1888 మద్రాసులో జరిగిన దేశీయ మహాసభలకి (కాంగ్రెసు మహాసభలు) ప్రతినిధిగా వెళ్లారు. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులు గారు వీరేశలింగం పంతులుగారి ఉద్యోగ భద్రత దృష్ట్యా వారిని ప్రతినిధుల లిస్టులో నుంచి తొలగించారు. ఈ విషయం పంతులుగారు తమ స్వీయ చరిత్రలో రాసుకున్నారు. దేశీయ మహాసభ అన్న పుస్తకాన్ని కూడా రాశారు.

రాజమండ్రి పట్టణంలో జాతీయోద్యమం ప్రారంభంనుండి పలు వుద్యమాలలో జైళ్లకి వెళ్లి, లాఠీ దెబ్బలుతిని, దేశ స్వాతంత్ర్యమే తమ ధ్యేయంగా జీవితాలను అర్పణ చేసుకున్న స్వాతంత్ర్య సమర యోధులలో శ్రీయుతులు పందిరి మల్లిఖార్జునుడు, దశిక సూర్యప్రకాశరావు, అంకరాజు శంకరరావు, వంటెద్దు పార్వతీశం, అరవ ఆదినారాయణ, కందుల జగన్నాధరావు, గాడేపల్లి సూర్యనారాయణ, ఎస్.వి.రామారావు నేషనల్ స్కూలు స్థాపకులలో ఒకరు. మాచిరాజు శ్రీ రామ చంద్రమూర్తి (బండరాముడు), కందుల జగన్నాధరావు, గజవల్లిరామ చంద్రరావు, మామిడి అప్పారావు, తలచెట్ల గురువులు, నలుమూరి నరసింహ అప్పారావు, ఇవటూరి సుబ్బారావు,

దంగేటినారాయణ స్వామి, వెన్నేటి సత్యనారాయణ, నాళం భీమరాజు, ఇంకామరెందరో మాన్యులున్నారు.

జాతీయోద్యమంలో మహిళల పాత్రకి తక్కువలేదు. పురుషులతో సమానంగా స్వాతంత్ర సంగ్రామంలోకి ఫురికారు. ఛాందస కుటుంబాలకి చెందిన వారు సైతం తమ ఆచార వ్యవహారాలను ప్రక్కకు నెట్టి జైళ్లకి వెళ్లి లాఠీ దెబ్బతిన్నారు. తిరిగి తిరిగి జైళ్లకు వెళ్లిన వారున్నారు. అలాంటి నారీ మణులలో శ్రీ మతులు పాలకోడేటి శ్యామలాంబ, పెద్దాడ కామేశ్వరమ్మ, చేబియ్యం శేషమ్మ, బారు అలివేలమ్మ, రాచకొండ గవరమ్మ, మానా ప్రగడ సుందరమ్మ, సింహాద్రి అన్నపూర్ణాదేవి, కెల్లి సుబ్బమ్మ, మద్దాల సీతమ్మ, సుసర్ల సీతామహాలక్ష్మి, గూడూరి నాగరత్నమ్మ, రెల్లి దుర్గమ్మ, మరెందరో ఇంకా వున్నారు.

శ్రీ జి. వరదరావు జాతీయోద్యమానికి ఉద్యమకారులకి అండదండలుగా వుండి ఎనలేని సహకారం అందించారు.

శ్రీ యుతులు రాయపూడి రామకృష్ణారావు ఆర్.బి. పెండ్యాల, చెరుకూరి వీరరాఘవస్వామి, పట్టికూటి సీతారామచౌదరి, కంచర్ల సుబ్బారావు, చిట్టూరి ప్రభాకర చౌదరి, జి.ఎస్. బాలాజీదాసు, ఎ.వి.రమణయ్య ప్రభృతులు స్వాతంత్ర్యానికి ముందు జైలుకి వెళ్లి ఆనాటి ఉద్యమానికి ఆనవాలుగా సజీవులుగా వున్నారు.

రాజమండ్రి స్వాతంత్ర సమరయోధుల చరిత్ర పూర్తిగా రాయాలంటే భారతమంత గ్రంధమౌతుంది. స్థలాభావంచేత ఆనాటి ఉద్యమ కారుల పేరులన్నీ ఉదహరించడం సాధ్యపడనందుకు క్షంతవ్యుణ్ణి.

## సీతానగరం గౌతమీ ఆశ్రమం

1921లో గాంధీజీ నడిపిన మహా ఉద్యమంలో ఆంధ్రప్రాంతంలో నిష్ణాతులైన నాయకులు 300 మంది జైళ్ల పాలైనారు. ఆవుద్యమంలో రాజమండ్రికి 16 మైళ్ల దూరంలో గల సీతానగరం ప్రజలలో జాతీయ

చైతన్యం పొంగిపొర్లాడుతోంది. 1922 ఫిబ్రవరిలో చౌరీ చౌరాలో ప్రజలు పోలీసులపై దాడి చేసి హింసాకాండకి దిగారని గాంధీజీ ఉద్యమాన్ని హఠాత్తుగా ఆపివేశారు. అగ్రనాయకులకు, కార్యకర్తలకు అలా ఉద్యమాన్ని ఆపుచెయ్యడం తీవ్ర అసంతృప్తిని కలిగించింది. గాంధీజీకి ఆ సందర్భంగా ఆరు సంవత్సరాల శిక్ష విధించారు.

అసంతృప్తి చెందిన ఉద్యమకారులు చెల్లాచెదురు కాకుండా ఆశ్రమాలు నిర్మించి దేశ భక్తులను కూడా గట్టాలని కొందరు నాయకులు నిర్ణయించారు. ఆ నిర్ణయానుసారం సీతానగరంలో డా॥ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు గోదావరీ నదీ తీరాన గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమాన్ని స్థాపించారు. 1921 సత్యాగ్రహంలో ఆ గ్రామస్తులు ముందు భాగాన నిలిచారు. గ్రామోద్యోగులు తమ నౌకరీలను తృణ ప్రాయంగా వదలి పెట్టి, కాంగ్రెసు ఉద్యమ వ్యాప్తికి తోడ్పడ్డారు. బ్రిటిష్ కలక్టరుకి ఆగ్రామంలో నిప్పు నీరూ పుట్టలేదు. అతని ముఖ్య ఆహారం కోడిగుడ్లుకూడా దొరకలేదు. ప్రయాణానికి కనీసం ఒక బండికూడా దొరకలేదు.గామ ప్రజలు శాంతియుత సహాయనిరాకరణ పోరాట పద్ధతి బ్రిటిష్ పాలకులకు పక్కలో బల్లెమైంది.

సామాన్య రైతు జనం, నాయకులైన శ్రీయుతులు నీరు కొండ వెంకటరత్నం, మూరిన సుబ్బారావు, కాండ్రు వీరన్న, కొత్త విశ్వనాథం, కనగర్ల నరసింహం, మద్దూరి పాపారావు, శ్రీపాద వెంకట రామయ్య, చాపర్ల సుబ్బన్న, తెలికి చర్ల నరసింహస్వామి బ్రిటిష్ నిరంకుశత్వాన్ని ఎదిరించి జైళ్లపాలైనారు.

అలాటి స్థితిలో డా॥ సుబ్రహ్మణ్యంగారు సీతా నగరంలో గౌతమీ సత్యాగ్రహాశ్రమాన్ని నిర్మించి భారత దేశ భక్త చిత్రపటంలో ప్రముఖ స్థానానికి తెచ్చారు. సేట్ జీవనలాల్ ఆశ్రమానికి పదివేలరూపాయల విరాళం ప్రకటించి, ఏటా 2500 కూడా ఇస్తామన్నారు. మహర్షి బులుసు సాంబమూర్తి ఆశ్రమట్రస్టీగావున్నారు ప్రముఖ జాతీయ వాది శ్రీరామ చంద్రుని వెంకటప్పయ్య, శ్రీయుతులు ధరణీ ప్రగడ శేషగిరిరావు, వారి సోదరుడు కృష్ణమూర్తి, ఓలేటి నరసింహం(రాజోలు) మానా ప్రగడ కృష్ణారావుమరికొందరు

ఆశ్రమవాసులైనారు. అక్కడవుండే వారికి, గ్రామపునరుద్ధరణ, ఖద్దరు వడకడం, నిర్మాణ కార్యక్రమంగా స్వీకరించాలని షరతుపెట్టారు.

అంతకు ముందు మద్దూరి అన్నపూర్ణయ్య ఆయన స్థాపించిన కాంగ్రెసు పత్రిక తోనూ సంబంధం వున్న శ్రీ క్రొవ్విడి లింగరాజూ సీతానగరం ఆశ్రమానికి చేరారు. ఆశ్రమ స్థాపన నిర్ణయం జరిగాక ఆశ్రమ నిర్మాణానికి ఆప్రాంతం నాయకులు చర్చించి, గోదావరి గట్టున 14యకరాల గరువుని రూ. 3000 లకి ఖరీదు చేశారు.

1924 నవంబరు 9 తేదీ రాత్రి మహర్షి బులుసు సాంబమూర్తి గారు ఈ ఆశ్రమానికి గౌతమీ ఆశ్రమమని పేరుపెట్టారు. గ్రామస్థుల సహకారంతో 1925 నాటికి పక్కా ఇళ్లూ, మంచి నీళ్ల నుయ్యీ తయారు చేశారు.

ఏకులు చెయ్యడం, నూలు వడికించడం, నేత మొదలైన పనులు ఆశ్రమంలో ప్రారంభించారు. ఆశ్రమ మేనేజరు శ్రీ ధరణీప్రగడ శేషగిరిరావు గారు వైద్య సేవలకు వైద్య శాల ఏర్పాటు చేశారు. హిందీ పాఠాలు ప్రారంభించారు. శ్రీ పీసపాటి సుబ్బారావు హిందీ అధ్యాపకులు డా. సుబ్రహ్మణ్యంగారి సోదరులు శ్రీ బ్రహ్మజ్యోస్యుల సీతారామయ్య తమ డిప్యూటీ ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్సు ఉద్యోగానికి రాజీనామా నిచ్చి, ఆశ్రమంలో ఒక దేశీయ విద్యాకేంద్రాన్ని నిర్వహించారు. శ్రీ మానాప్రగడ కృష్ణారావు హరిజన విభాగ కార్యక్రమాలను నడిపారు

శ్రీయుతులు మాచిరాజు శ్రీ రామచంద్రమూర్తి (బండరాముడు), జ్యోస్యుల అప్పలరామమూర్తి, గూడూరు రంగయ్య, (కర్నూలు), గట్టిం సూర్యనారాయణ, వంగల సత్యనారాయణ, మద్దూరి కృష్ణమూర్తి(అన్నపూర్ణయ్య సోదరులు), గండేపూడి రామకృష్ణ శర్మ ప్రభృతులు మరెందరో ప్రెస్ కంపోజింగు, ప్రింటింగు తదితరపనులను నేర్చుకుని అక్కడ పనులు దిగ్విజయంకావడానికి కృషి చేశారు. వీరందరూ జైళ్ల పాలై లాఠీ దెబ్బలు తిన్నవారే.

1926 జూలై నెలలో అల్లూరి సీతారామరాజు జయంతి సందర్భంగా

"కాంగ్రెస్" ప్రత్యేక సంచిక వెలుపడింది. దానిలో "మన్యం సీతారామరాజు పద్ధతులతో నేనేకీభవించలేకపోయినా ఆయన దేశభక్తినీ,త్యాగాన్నీ, సేవాపరాయణ తనీ ప్రశంసించక తప్పదు" అని గాంధీజీ సందేశాన్ని పంపారు. గాంధీజీ వుత్తరాన్ని బ్లాకు చేయించి ముద్రించారు. రాజద్రోహనేరం క్రింద శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యను ఈ సందర్భంగా అరెస్టు చేశారు శ్రీ క్రొవ్విడి లింగరాజు ఈ పత్రికను నడిపారు. ఈ పత్రికను నడపడానికి శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు భూరివిరాళం ఇచ్చారు శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి (స్వామీ సీతారం) గుంటూరు నుండి వచ్చి ఆశ్రమంలో చేరి పత్రికా విభాగంలో సహకరించారు

1929 మే నెల 9-10 తేదీలలో గాంధీజీవచ్చి ఆశ్రమంలో గడిపి పరమానందం చెందాడు ప్రతిరోజూ గాంధీజీని దర్శించడానికి 50, 60 వేల జనందాకావచ్చేవారు ఆ ప్రజలందరికీ ఆ ప్రాంతం ప్రజలు స్వచ్ఛందంగా సమకూర్చి భోజనాలు ఏర్పాట్లు చేశారు ఆనాడు సామాన్య ప్రజల దేశభక్తికి, సామ్రాజ్య వాద వ్యతిరేకతకి అది నిదర్శనం

ఆశ్రమం పరిసర గ్రామాల ప్రజలు గాంధీజీ ఖద్దరు నిధికి రూ. 6000/ సమర్పించారు బంగారునగలు యిచ్చారు గాంధీజీ ఆశ్రమ ఔన్నత్యాన్ని యంగ్ ఇండియా పత్రికలో ప్రశంసిస్తూరాశారు

ఆశ్రమం పాడి సంపదవుంది కూరగాయలు పండించేవారు. గాంధీజీతో బాటు ఆశ్రమంలో శ్రీమతులు సరోజినీనాయుడు, మీరాబెన్, దేశభక్త కొండా వెంకటప్పయ్య ప్రభృతులున్నారు గాంధీజీ రెండవసారి 1933లో ఆంధ్రదేశ పర్యటన సందర్భంగా వచ్చినపుడు సీతానగరం ఆశ్రమంలోనే వున్నారు

1932 జనవరి 7వ తేదీన గౌతమీ ఆశ్రమాన్ని చట్టవిరుద్ధమైనదని ప్రకటించి 18వ తేదీని స్వాధీనం చేసుకుంది 1933 లో పోలీసు అధికారి, ముష్కరుడు ముస్తఫాలీగారి బృందం ఆశ్రమంమీద దాడిచేసి ధ్వంసంచేశాడు. ఆశ్రమవాసులపై నిర్దాక్షిణ్యంగా లాఠీచార్జి చేశాడు. ఆశ్రమంలోని సామాగ్రిని,

ప్రెస్‌ని నాశనం చేశాడు.

సీతానగర ఆశ్రమం అన్నివుద్యమాలకీ తనవంతుగా అనేక మంది స్వాతంత్ర్య యోధులను పంపింది. స్వాతంత్ర్యం వచ్చే దాకా ఆవిధంగా తనవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించింది. స్వాతంత్ర్యం వచ్చాక, అక్కడ గ్రామ సేవికల శిక్షణా కేంద్రాన్ని ప్రారంభించారు.

ఈ ఆశ్రమాభివృద్ధికి శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మ ఎంతో కృషి చేశారు. కాని ప్రస్తుతం ఈ ఆశ్రమ పరిస్థితి అంతగా బాగోలేదు. ఈ ఆశ్రమస్థాపకుల పవిత్ర ఆశయాలకు, ధ్యేయాలకూ అనుగుణ్యంగా అభివృద్ధి గావించడం, కుల, మత సామరశ్యాన్ని సాధనకి ప్రచారం చేసే కేంద్రంగా రూపొందించడం ప్రభుత్వ కర్తవ్యం

సూర్యుడు పూర్తిగా పశ్చిమ దిశలో మునిగిపోయాడు. అరుణరంజితం మాత్రం అంతా ఆవరించేవుంది. బాగా చీకటి పడిపోయింది. దీనికి తోడు గోదావరి గట్టున దీపాలు ఆరిపోయివున్నాయి. ఏవో అనేక ప్రశ్నలు దయిస్తున్నాయి.

ఈనాడు దేశం ఏర్పాటు వాదాలతో తీవ్రవాద హత్యాకాండలతో నాయకుల హత్యలతో, మత మహామ్మారి మారణహోమంతో, కులతత్వాల కుళ్లుతో, గూండాల స్వైర విహారాలతో, కిరాయి హంతకులతో, కుతకుత లాడుతోంది. దారి పొడుగునా నెత్తురు తర్పణ చేస్తూ భారత దేశదాస్య విముక్తికి తృణ ప్రాయంగా తమ ప్రాణాలర్పించిన అమర వీరులూ, అహింసామార్గంలో, కఠిన కారాగారవాసాలతో, లాఠీ దెబ్బలకీ, కొరడా దెబ్బలకీ తనువూ మనసూమగ్గినా, కఠోరదారిద్ర్యం ఆవహించినా సంసారాలను లెక్క చెయ్యకుండా స్వాతంత్ర్య సముపార్జనకి జీవితాలను ధారపోసిన అహింసామూర్తులు స్వాతంత్ర్యం సంపాదించిందిందుకేనా అనే ప్రశ్న మిగిలిపోతోంది. మనిషి ఆశాజీవి. రేపు సూర్యుడు దయిస్తాడు ఆ నిశ్శబ్ద నిశీధంలో గోదావరినదిలోని అలల చిరుశబ్దాలు వినిపిస్తున్నాయి.

(రిఫరెన్సులు : భారత స్వాతంత్ర్య సమరాంగణంలో గోదావరీతీరం)

వరదా బ్రహ్మానందం

ఫ్రీడం ఫైటర్ జర్నలిస్టు

76–4–32– గాంధీపురం – 2

రాజమండ్రి – 533103

# రాజమహేంద్రిలో గ్రంథాలయోద్యమం

సన్నిధానం నరసింహశర్మ

గ్రంధాలయాల స్థాపనలో, గ్రంధాలయోద్యమంలో, స్థాపిత గ్రంథాలయాలను నిర్వహించడంలో అయ్యంకి వంటి ఉద్యమమహానీయులకు స్ఫూర్తినివ్వడంలో రాజమండ్రి ముందునుండీ ముందే ఉన్నది.

కేంద్రప్రభుత్వ గ్రంథాలయం, రాష్ట్రప్రభుత్వ గ్రంథాలయం, కళాశాల, పాఠశాల గ్రంధాలయాలు, ప్రయివేటు గ్రంధాలయాలు, శాఖాగ్రంథాలయాలు ఉన్న నగరం రాజమహేంద్రవరం.

## కేంద్ర పొగాకు పరిశోధనా సంస్థ గ్రంధాలయం

ఇది రాజమండ్రి భాస్కర్‌నగర్‌లో ఉన్న కేంద్ర ప్రభుత్వ గ్రంథాలయం. శాస్త్రీయ పద్ధతులలో నడుస్తున్న గణనీయ గ్రంథాలయం. 1950లో స్థాపించబడింది. శాస్త్రీయ సమాచార సేవలందించడంలో ఆంధ్రరాష్ట్ర ప్రఖ్యాతేకాదు, కొన్ని యితర రాష్ట్రాల ప్రఖ్యాతి కూడా సముపార్జించింది. తమిళనాడు, కర్ణాటక, పశ్చిమబెంగాల్, బీహారు రాష్ట్రాలలో గల కేంద్ర ప్రభుత్వ పొగాకు పరిశోధనా కేంద్రాలకు గూడా ఈ గ్రంథాలయం వినియోగపడుతూ వర్తమాన కాలంలో వంద మంది పరిశోధకులకు సక్రమంగా వినియోగపడుతున్నది. 10,942 పుస్తకాలున్న ఈ గ్రంధాలయం పొగాకు సంబంధంగా సర్వవిధ సమాచారాలను స్వీకరించి సంరక్షిస్తూ పరిశోధకోపయోగకరంగా ఉన్నది. 10,070 పత్రికల వెనుక సంపుటాలు, 3931 నివేదికలు, ఈ విధంగా అనేకం ఈ గ్రంధాలయంలో ఉన్నాయి.

బైండింగు యూనిట్టు, జెరాక్సు మిషను వంటి ఆధునిక సౌకర్యాలున్నాయి. ఆధునిక వసతులతో విలసిల్లుతున్న ప్రత్యేక గ్రంధాలయం పుస్తకాలైతేనేమి, పత్రికా సంపుటాలైతేనేమి ఈ గ్రంధాలయంలో మొత్తం 25,843 మించే వున్నాయి. పరిశోధక వసతులు గణనీయంగా ఉన్న గ్రంథాలయం.

## ప్రభుత్వ కళాశాలా గ్రంథాలయం

శతాబ్దంపై బడిన చరిత్ర గల రాజమండ్రి ప్రభుత్వ కళాశాలకు చెందిన గ్రంథాలయం ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాలా గ్రంథాలయాల్లో పేరు పొందిన గ్రంథాలయం. సుమారు లక్ష గ్రంథాలున్నాయి. ఆంగ్లాంధ్రభాషలలో ఎన్నో ప్రాచీన గ్రంథాలున్నాయి. పరిశోధకులచే వినియోగమవవలసిన గ్రంథాలయం నూతనంగా అభివృద్ధి చేయవలసిన పెద్ద గ్రంథాలయం.

## శ్రీ గౌతమీ ప్రాంతీయ గ్రంథాలయం

స్థాపన : 1898; రిజిస్టరయినది 1920లో. రాష్ట్ర ప్రభుత్వంచే శ్రీ గౌతమీ గ్రంథాలయం 1979 ఫిబ్రవరి 19వ స్వీకరించబడి 'శ్రీ గౌతమీ ప్రాంతీయ గ్రంథాలయం'గా ఒక ప్రభుత్వోత్తర్వు ద్వారా పునర్నామకరణం చేయబడింది. వీరేశలింగం అనుచరుడు, శిష్యుడు మధురకవి శ్రీనాళం కృష్ణారావుగారు 1898లో రాజమండ్రిలో నాళం వారి సత్రంలో తొలుత శ్రీ వీరేశ గ్రంథాలయంగా స్థాపించబడింది ఒకనాడు నోబుల్ బహుమానం వస్తుందని భావించబడిన 'భక్తచింతామణి' కర్త వడ్డాది సుబ్బారాయుడుగారి పేరున 'వసురాయ గ్రంథాలయం' ప్రభుత్వ సమగ్ర బోధనాభ్యసన కళాశాల సమీపంలో ఉండేది నాళం వారిచే స్థాపించబడిన వీరేశలింగ గ్రంథాలయం సమకాలీన కారణాలమూలంగా సర్వజన గ్రంథాలయంగా పేరు మార్చబడినది.

సర్వజన గ్రంథాలయం, వసురాయ గ్రంథాలయాలు రెండూ పండిత బృందాల ఆధ్వర్యంలో, విరాళాలిచ్చే ఉదారుల వితరణల కారణంగా పోటాపోటీగా అభివృద్ధి అవుతూ వచ్చాయి నగర సాంస్కృతిక సాహిత్య ప్రతినిధుల సమైక్య ఆలోచనా ఫలంగా -- సర్వజన వసురాయ గ్రంథాలయాలు సమ్మేళనమై, రాజమహేంద్రవరం వద్ద గౌతమి విశాలమైనట్లుగా -- శ్రీ గౌతమీ గ్రంథాలయంగా బృహద్గ్రంథాలయమైనది

గౌతమీ గ్రంథాలయం రాజవీధి (పూర్వం ఇప్పటి మెయిన్ రోడ్డును

రాజవీధి అనేవారు)లో శాంతినివాస్ హొటల్ ఎదురుగా గల కాకి వారి భవనంలో ఉండేది. రాను రాను 'పుస్తక సంచయం' పెరగడం సభ్య పాఠక జనం పెరగడం కారణాలుగా స్వంతస్థలం, స్వంతభవనం ఆలోచనలు పెద్దల మెదళ్ళకు పనిజెప్పాయి. గౌతమీ గ్రంథాలయం రాష్ట్రంలోగల పెద్ద గ్రంథాలయాలలో ఒకటి కనుక, విలువైన గ్రంథాలుండడం వలన రాష్ట్ర ప్రసిద్ధులు శ్రీ కాశీనాధుని, శ్రీ గిడుగు, శ్రీ భోగరాజు వంటివారు శ్రీ గౌతమీ గ్రంథాలయాన్ని దర్శించడం దాని అభివృద్ధిపట్ల స్పందించడం జరిగేది. శ్రీ కందుకూరి, శ్రీ చిలకమర్తి, శ్రీ న్యాపతి, శ్రీ కంచుమర్తి సీతారామ చంద్రరావు, శ్రీ వడ్డాది, శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రి, తెన్నేటి రామశంకరం, మహీధర జగన్మోహనరావు, ప్రభృతులైన ఎందరిచేతనో సేవలందుకున్నది. 57 వేల పై చిలుకు గ్రంథాలున్నాయి. ఇందులో 412 తాళపత్ర గ్రంథాలున్నాయి. 6 తామ్రశాసనాలున్నాయి. తిరుమల - తిరుపతి దేవస్థానంవారు ప్రచురించిన శ్రీ మదాంధ్రికృత ఋగ్వేదసంకిత' గౌతమీవ్రాత ప్రతులచలవే. మెకంజీవ్రాత ప్రతుల 3 సంపుటాలు, స్వరయుతసామవేదం, వంశవృక్ష ప్రదర్శినివంటి వ్రాతప్రతులున్నాయి. వివేకవర్థిని, చింతామణి, మానవసేవ, ప్రబుద్ధాంధ్ర, అనల్పజల్పితాకల్పవల్లి వంటి ఎన్నో ముఖ్య పత్రికలు పాతకాలం నాటివి అరుదైనవి ఈ గ్రంథాలయంలో భద్రపరచబడివున్నాయి.

ఇండియన్ సోషల్ రిఫార్మర్, ఇండియా వంటి ఆంగ్ల పత్రికలు కూడా వున్నాయి. 19వ శతాబ్దం చివర భాగంలోను 20వ శతాబ్ద ప్రథమ భాగంలోనూ అచ్చయి వచ్చిన తెలుగు పుస్తకాలు ఈ గ్రంథాలయ ఆభరణాలు. లోగడ నార్ల వేంకటేశ్వరరావుగారు ఈ గ్రంథాలయాన్ని దర్శించి 'ఎ గ్రేట్ లైబ్రరీ విత్ గ్రేట్ ప్రోబ్లమ్స్' అని వ్రాశారు. 1922 నుండి సముచిత భవనం కావాలనేదీ ప్రధాన సమస్య అయింది. భవననిర్మాణం ఆర్థిక దుస్థితి వంటి కారణాల వలన, ప్రజోద్యమ కారణాలవలన ఈ గ్రంథాలయం ప్రభుత్వ పరమైనది. 1979లో ప్రభుత్వ స్వీకరణానంతరం ప్రణాళిక, ప్రణాళికేతర నిధులతో అభివృద్ధి పరచబడుతూ వస్తున్నది.

తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో ముఖ్యమైన వ్రాతప్రతులు ఫోటోస్టాట్ ప్రతులు తీసి భద్రపరచబడ్డాయి; వారి సహాయంతోనే తాళపత్రం గ్రంథశాస్త్రీయ రక్షణ, ఒక కాశీ పండితునిచే వర్ణనాత్మక గ్రంథసూచీ తయారీ జరిగాయి. ప్రభుత్వంవారు లక్ష వెచ్చించి ముఖ్యమైన తాళ పత్రగ్రంథాలకు, పత్రికాసంపుటాలకు మైక్రోఫిల్మ్ తీయించారు. జెరాక్సు మిషనుకొనబడింది. ఇటీవల లక్ష రూపాయల పర్నిచరు కొనబడింది. రాష్ట్ర ప్రభుత్వం సుమారు 4 లక్షల అరువది వేల పై చిలుకు సొమ్ముతో నూతన భవన విభాగం నిర్మితమైనది. మూడంతస్తుల భవనం నిర్మించాలనే సదాశయంలో ఇది ఒక దశ.

ఇందులోని బాబాయమ్మహాలు సాహిత్య సాంస్కృతిక సభలకు పెట్టిందిపేరు. శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రి గండపెండేరమహోత్సవం వంటి ఒకనాటి విశిష్ట సాహిత్య సభలు ఈ హాలులోనే జరిగాయి. జమీందారు కంచుమర్తి సీతారామ చంద్రరావుగారు వారి అమ్మాయి కీర్తిశేషురాలుగా అమ్మాయి పేరుగా కట్టించిన హాలిది. రాష్ట్ర పౌరగ్రంథాలయ శాఖ క్రింద పనిచేస్తున్న ప్రాంతీయగ్రంథాలయం.

3,100 చదరపు గజాల స్థలంలో కల గ్రంథాలయం సాహిత్య కార్యకలపాలచే, ఉద్యమ భాగస్వామ్యంచే పరిశోధకుల వినియోగంచే రాష్ట్ర, రాష్ట్రేతర ప్రసిద్ధిగాంచింది. విదేశాల వారు ప్రచురించే గ్రంథాలయాల దర్శినులలో గౌతమీ ప్రాంతీయ గ్రంథాలయం చోటు చేసుకోవడం సహజ విషయమే. ఆంధ్రగ్రంథాలకేకాదు ఆంగ్లగ్రంథాలకుకూడా 'గౌతమి' చెప్పుకోదగినది. తెలుగులో గొప్ప పరిశోధకుడు, పండితుడు కావలెనని గౌతమీ నీటిని సేవించవలెను, 'గౌతమీ గ్రంధాలయములోని గ్రంథములను చదువవలెను' అనునది కట్టమంచి రామ లింగారెడ్డిగారి మహోక్తి.

## శ్రీ వీరేశలింగాస్తిక గ్రంథాలయం

పురమందిరంలో గల సుమారు వంద సంవత్సరాల చరిత్ర సంతరించుకున్న

గ్రంథాలయం. హితకారిణీ సమాజం ఆధ్వర్యంలో ఉంటూ వచ్చింది. ఆంధ్రపత్రిక దినపత్రిక సంపుటాలు ఎన్నో వున్న గ్రంథాలయం. వివేకవర్థిని, చింతామణి వంటిపాత పత్రికలున్న గ్రంధాలయం. వీరేశలింగం సంతకాలతో కూడా వున్న గ్రంధాలున్న ఈ గ్రంథాలయం ప్రస్తుతం ఒక మూతపడిన గ్రంథాలయంగా ఉండడం విచారకరం. అభివృద్ధి పరచడమో, 'గౌతమీ' వంటివానిలో కలపడమో అవసరం అని పరిశోధకులు భావిస్తున్నారు. సుమారు అయిదు వేల గ్రంథాలున్నాయి.

## రాళ్ళబండి సుబ్బారావు గవర్నమెంటు మ్యూజియం గ్రంధాలయం

రాజమండ్రి కుమారిటాకీసు వద్ద గోదావరి ఒడ్డున డాసి వున్న గ్రంథాలయం. కళా ప్రపూర్ణ చిలుకూరీ నారాయణరావు, గిడుగు వెంకట రామమూర్తి పంతులు వంటి అగ్రశేణి సాహిత్యనిధుల వ్యక్తిగత సేకరణలైన తాళ పత్ర గ్రంధాలిందులోనున్నాయి. 1964లో రాళ్ళబండి సుబ్బారావుగారు 'ఎ డిస్క్రిప్టివ్ కేటలాగ్ ఆఫ్ తెలుగు మాన్యస్క్రిప్ట్' పేర 528 పుటల వర్ణనాత్మక గ్రంధసూచికలో 301 తాళపత్ర గ్రంధాల అనుపానులియ్యబడ్డాయి. ఈ రాజమండ్రి గ్రంథాలయంలో ఒకనాటి పెద్దలకృషి వలన అనంతపురం, విశాఖపట్నం, గంజాంజిల్లాల నుండి సేకరింపబడిన తాళపత్రగ్రంధాలను చక్కగా భద్రపరచబడడం చూడగలుగుతున్నాం. 1922 నుండి చరిత్రగల ఆంధ్రేతిహాసక పరిశోధన మండలి 1-3-1967వ తేదీన రాష్ట్ర ప్రభుత్వంచే స్వీకరించబడింది. ప్రభుత్వ స్వీకరణ కాలానికి ఈ గ్రంథాలయంలో 6954 పుస్తకాలుండేవి. ఇప్పుడాసంఖ్య 9925కి పెరిగింది. స్థాపకుల లక్ష్యానుగుణంగా పరనాలయం, గ్రంధాలయం నడపబడుచున్నవి. పురావస్తుశాఖా సంరక్షిత గ్రంధాలయం.

## ప్రభుత్వబాలికా పాఠశాలాగ్రంథాలయం

1904లో ప్రభుత్వ బాలికా పాఠశాల స్థాపించబడింది. ఈ పాఠశాలలో

తక్కువ సంఖ్యలోనైనా కొన్ని పాతపుస్తకాలున్నాయి. మొత్తం 9,434 పుస్తకాలున్నాయి.

## శ్రీ రామ బాలభక్త పుస్తక భాండాగారం

రాజమహేంద్ర వంకాయల వారి వీధిలోని ఈ గ్రంధాలయ చరిత్రకే షష్టిపూర్తి దాటింది 1920లో శ్రీ రామ బాలభక్త సమాజంచే 700 పుస్తకాలతో ఏర్పాటయిన ఈ సంస్థ రాజమండ్రి ప్రయివేటు గ్రంథాలయాలలో నిత్యం ప్రజలకు సేవచేస్తూ నగరము మధ్య ప్రాంతములో వాణిజ్యకూడలిలో 'వాణి'సేవ చేస్తున్న సంస్థ. ప్రజాకవిచెళ్ళపిళ్ళ, స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ బ్రహ్మజ్యోశుల, గాడిచర్ల, అయ్యంకి వంటి హేమాహేమీలైన గ్రంధాల యోద్యమ స్వరూపులు ఈ గ్రంధాలయాన్ని సందర్శించి ఆనందం వ్యక్తం చేశారు. 1945లో ఈ సంస్థ రిజిస్టరయింది పదివేల గ్రంధ సంపదతో అలరారే ఈ గ్రంధాలయం పరిశోధకులకు సద్వినియోగపడుతున్నది. 1925 తదనంతర సంవత్సరాలలో వార్షిక సభలు బాగా జరిగాయి. శ్రీ మానవల్లి, శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రి, శ్రీ చిలుకూరి నారాయణరావు వంటి సుప్రసిద్ధులు ఆయా వార్షికోత్సవాల్లో ప్రసంగించేవారు. 18 సంవత్సరాలపాటు ఏకటాకీగా లిఖితపత్రికను నడిపిన కార్యకలాపాలు గల సంస్థ ఇది. భారతి, ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు చాలా మట్టుకు ఈ గ్రంధాలయంలో లభ్యపడుతున్నాయి పెంకుటింట్లో నడుస్తున్న గ్రంధాలయమిది జిల్లా గ్రంధాలయసంస్థ, రాజారామ మోహనరాయ్ ఫౌండేషన్ వంటి సంస్థల సహాయ సహకారాలు ఈ గ్రంథాలయ ప్రగతికి కొంత దోహదం చేశాయి.

వేద వేదాంత హెూమియో గ్రంధాలయం – దువ్వూరి రామకృష్ణారావు ట్రస్టు వారిచే నడపబడుతున్న గ్రంధాలయం. 1971లో స్థాపించబడిన ఈ గ్రంధాలయంలో సుమారు 2 వేల పుస్తకాలున్నాయి నాలుగు వేదాలూ భాష్యసహితంగా ఉన్న గ్రంధాలయం, ఉపనిషత్తులు, వాని బాష్యాలు ఉన్నాయి. బ్రహ్మసూత్రాలు, భాష్యాలు, భగవద్గీతకు వచ్చిన వివిధ భాష్య గ్రంధాలు,

200 పై చిలుకు హోమియోపతి గ్రంథాలూ వున్నాయి. ధర్మశాస్త్రాలు, వాని భాష్య గ్రంధాలు వున్నాయి. భాగవతానికి శ్రీ ధరీయ భాష్యం తాళపత్రగ్రంధంగా వున్నది. ఈ గ్రంథాలయం శ్రీ రామనగర్, రామకృష్ణారావు పేటలో ఉన్నది.

## తెలుగు విశ్వవిద్యాలయ గ్రంధాలయం

హైదరాబాదులో తెలుగు విశ్వవిద్యాలయం వారు 1986లో గ్రంథాలయాన్ని ఏర్పాటు చేశారు. గ్రంధాలయ వికేంద్రికరణ భాగంగా 1987లో రాజమండ్రి సాహిత్యపీఠంలో గ్రంధాలయం ఏర్పాటు చేశారు ప్రస్తుతం బొమ్మూరు మెట్టమీద విశ్వవిద్యాలయంలో గల ఈ గ్రంధాలయం ఆధునిక సౌకర్యాలతో అలరారుచున్నది తొలుత హైద్రాబాదు నుండి తెచ్చిన 2,500 గ్రంధాలతో నున్న ఈ గ్రంధాలయం 6,000 బహుకృత గ్రంధాలతో కొనుగోలు చేసి 8,000 గ్రంధాలతో - మొత్తం సుమారు 14,000 ఆంధ్రాంగ్ల సంస్కృత పుస్తకాలతో ఎమ్ ఎ., ఎమ్ ఫిల్స్, పి.హెచ్.డి విద్యార్థి పరిశోధక ప్రయోజనదాయకంగా వర్షవర్షాభివృద్ధి చెందుతున్నది. సుమారు లక్ష విలువ చేసే పర్నిచరు ఉన్నది. జానపద విజ్ఞాన, సాహిత్య గ్రంధాలు చెప్పుకోదగిన ఉన్నాయి. దినప్రతికలు సంపుటాలుగ భద్రపరచబడు తూన్న ఈ గ్రంధాలయంలో వివిధ దినపత్రికల ఆదివారాల అనుబంధాలు ప్రత్యేకంగా భద్రపరచడం అబినందనీయం. ఆధునిక కవిత్వంలో అన్ని గ్రంథాలు సేకరించాలనే ఆలోచన ఉన్న గ్రంధాలయం.

## ప్రభుత్వ సమగ్ర బోధనాభ్యాసన కళాశాల గ్రంధాలయం

1883 నుండి చెప్పుకోదగిన చరిత్రగల గవర్నమెంటు కాంప్రెహెన్సివ్ ట్రెయినింగ్ కాలేజ్ లోని ఈ గ్రంధాలయంలో 31,000 పుస్తకాలున్నాయి రాజమహేంద్రిలోని కళాశాలా గ్రంధాలయాలలో ప్రభుత్వ కళాశాల గ్రంధాలయం తరువాత చెప్పుకోదగిన కళాశాల గ్రంధాలయం. ప్రాచీన గ్రంధాలు చాలా వున్నాయి.

## సీతంపేట శాఖా గ్రంథాలయం:

ఇది పట్టణంలోని శాఖా గ్రంథాలయాల్లో సభా కార్యకలాపాలచే ప్రముఖమైనది. దానవాయి పేటలో మహిళా గ్రంథాలయం, మహిళాసేవలకు బాగా వినియోగపడుచున్నది.

## కందుకూరి రాజ్యలక్ష్మి మహిళా కళాశాలా గ్రంథాలయం

మంచి భవనంలో నుండి నూతన గ్రంథాలతో విద్యార్థి జనోపయోగంగా సాగుతున్న గ్రంథాలయం

## ఆంధ్రకేసరి కళాశాలా గ్రంథాలయం

బహూకృత గ్రంథాలతో కొనుగోలుచేసిన గ్రంథాలతో సుమారు 5 వేలతో అభివృద్ధి పథంలోనున్న గ్రంథాలయం. స్టేడియం సమీపంలోని పొట్టి శ్రీ రాములు గ్రంథాలయం కార్మికులకు కూడా ఉపయోగపడే గ్రంథాలయం.

ఇవిగాక పట్టణంలో 20కి పైబడి క్రైస్తవ మత గ్రంథాలున్నాయి. ఇందులో లూథర్ గిరిలోని లూథరన్ లైబ్రరీ, ఆల్కట్ తోటలోని ఆంగ్లోఇండియన్ కేథలిక్ లైబ్రరీ, అప్సరాహోటల్ ఎదురుగా కేథలిక్ లైబ్రరీ వంటి ప్రసిద్ధమైన విందులోనున్నాయి. కోట గుమ్మం వద్ద గల చిన్న మసీదు - అదే గాజీ సయ్యద్ అబా బాకర్ షామసీదులో చాలామంచి ఉర్దూపుస్తకాలున్న గ్రంథాలయం ముస్లిములకు సేవచేస్తున్నది విద్యార్థి ఇస్లామిక్ సంస్థ ఆధ్వర్యంలో ఇదే మసీదులో కొత్తగా 500 పుస్తకాలతో విద్యార్థి జనోయోగంగా ఒక గ్రంథాలయం ఉన్నది ఈ విధంగా రాజమహేంద్రి ఎన్నో గ్రంథాలయాకు కేంద్రంగా ఉండడం అనందకరం

## శ్రీ రామకృష్ణమఠ గ్రంథాలయం

వీరభద్రపురంలో బిజిలీ ఐస్ ఫ్యాక్టరీ దాటిన తరువాత కోరుకొండ రోడ్డులో శ్రీ రామకృష్ణమఠంలో ఉపనిషదాధ్యాత్మిక గ్రంథాలు తదితరములు గల గ్రంథాలయం మంచి వసతులతో చక్కని వాతావరణంలో ఉండి ప్రశాంతపరుస్తూ పారకసభ్యులను ఆనందింప జేస్తున్న గ్రంథాలయం.

# కందుకూరి వీరేశలింగం గారి సంస్థలు

**- వైయస్. నరసింహారావు.**

యుగపురుషుడు శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు రాజమహేంద్రిలో నిర్మించిన మొట్టమొదటి సంస్థపురమందిరం. జనుల సామాజిక సాంస్కృతిక కార్యక్రమాల నిర్వాహణకు టౌన్‌హాలు అవసరమని గుర్తించి తమ సొంత ధనముతో 1890లో నిర్మించి, 1897 డిసెంబరు 3న ట్రస్టీడీడ్‌ను రిజిస్టర్ చేయించారు. మెయిన్ రోడ్ సమీపములో 1720 చ॥ గ॥ ఆవరణలో ఈ పురమందిరం వుంది. ఆయన నిర్మించిన మొదటి ట్రస్టబోర్డు సభ్యులు వీరు.

★ శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులు

★ శ్రీ చిత్రపు వెంకటాచలం

★ శ్రీ రాజాక్ళర్ల కోటరామచంద్ర వెంకటకృష్ణారావు

★ శ్రీ నేటి వెంకటసోమయాజులు

★ శ్రీ గోపిశెట్టి నారాయణ స్వామి నాయుడు

★ శ్రీ నాళం పద్మ నాభం

★ శ్రీ ఖాజా అహ్మదుల్లా ఖాన్ సాహెబ్

★ శ్రీ మంతెపూడి కామేశ్వరావు

★ శ్రీ కొటికలపూడి రామేశ్వరావు

★ శ్రీ రెబ్బా ప్రగడ పాపయ్య

★ శ్రీ రాజా కంచుమర్తి వెంకట సీతారామ చంద్రరావు

అమెరికన్ లూదరన్ మిషన్ సీనియర్ మిషనరీ జూబ్లీ పబ్లిక్ లైబ్రెరీ రీడింగ్‌రూమ్ సెక్రటరీ

" ఈ పురమందిరములో సమస్త విషయము లోను జ్ఞానాభివృద్ధి కలుగుటకును నీతి మత కులాచారములయందలి మూఢ విశ్వాసములు తొలగుటకును, నీతిపెంపొందుటకును, దుర్నీతి దురాచారములు తొలగుటకును

నీతి మత శాస్త్ర రాజ్యాంగ విషయములలో గుణదోష విచారము చేయుటకును అనుకూలములైన యుపన్యాసములు ప్రసంగములు వాదములు మొదలైన వాని కొఱకును, మహనీయులను సత్కరించుట కొఱకును, దేశాభివృద్ధికిని భాషాభివృద్ధికిని తోడ్పడు కృషి కొఱకును, జనుల సంతోషమునకును, వినోదమునకును, జరిగెడి ఆటపాటలకొరకును జనోపయుక్తములైన సమస్తేతర కార్యముల కొఱకును, హిందువు యూరోపియను క్రైస్తవుడు మహమ్మదీయుడు బ్రాహ్మణుడు శూద్రుడు అను నెట్టి భేద భావము లేక యెల్ల జాతులవారును సర్వమతముల వారును సభలు మొదలైనవి చేసికొనుటకే మందిరముపయోగపడవలెను". అని శ్రీ వీరేశలింగం గారు తమ ట్రస్టీడీడ్‌లో నిభందనను జేర్చారు. దీనికనుగుణంగానే ఇక్కడ ఈనాటికి కార్యక్రమాలు జరుగుచున్నాయి.

## శతవార్షికోత్సవం

ఈ సంవత్సరము ఈ పురమందిర శత వార్షికోత్సవము వంద సంవత్సరాలు పూర్తయినందున దీనిని రక్షిత కట్టడముగా గుర్తించవలసినదిగా రాష్ట్ర ప్రభుత్వ పురావస్తు శాఖను కోరడం జరిగింది. రాష్ట్ర రెవిన్యూ ప్రధాన కార్యదర్శి శ్రీ కె.ఎస్. ఆర్.మూర్తి చొరవతో ఈ పురమందిరం రక్షిత కట్టడముగా గుర్తింపబడి జీర్ణోద్ధరణకు పూను కోగలదని ఆశిస్తున్నాను. ఈ టౌన్ హాలులోగల వీరేశలింగం గారి తైలవర్ణ చిత్రాన్ని వారి శిష్యులైన శ్రీ రాజాకొచ్చర్ల కోట వెంకట కృష్ణ రావుగారు బహూకరించారని తెలుపుటకు సంతోసిస్తున్నాను. ఇందులో ప్రహర్షపఠన మందిరం (జూబ్లీ రీడింగ్ రూమ్) నాటినుండి నేటి వరకు నడుస్తూనే వున్నది. 1907 లో ఈ పురమందిరములో సుప్రసిద్ధ జాతీయ వాది శ్రీ బిపిన్ చంద్రపాల్ 5 రోజులు పాటు వరుసగా ఉపన్యాసములు ఇచ్చి, ముఖ్యంగా యువతరాన్ని జాతీయోద్యమం పట్ల ఉన్మకుల్ని చేసారు. వారి ప్రసంగాలను తెలుగులోకి అనువాదము శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు చేసారు. శ్రీ రాజాకంచు మర్రి వెంకట

సీతారామ చంద్రారావుగారు, ఆయా సభలకు అధ్యక్షత వహించారు.

## ప్రార్థనామందిరం

టౌన్‌హాల్‌కు ఆనుకునే పశ్చిమ దిశగా 80 చ.గ. ఆవరణలో 2 అంతస్తుల భవనాన్ని నిర్మించి అందులో ప్రార్థనా సమాజాన్ని నెలకొల్పారు. దీనికి రఘుపతి వెంకట రత్నంగారు ప్రారంభం చేసినారు. ఆ తరువాత 1200 రూ॥లు ఖర్చుపెట్టి స్త్రీలకు ప్రార్థనా మందిరాన్ని నిర్మించారు.

## వితంతు శరణాలయం

ఊరికి చివర నున్న ఆనందోద్యానవనములో సుప్రసిద్ధ న్యాయవాది శ్రీ ములుకుట్ల అచ్యుతరామయ్యగారి సహాయంతో వితంతు శరణాలయమును నిర్మించారు. ఇందులో 10 గదులుండేవి. అదే తోటలో వితంతువుల కోసం పాఠశాల కూడా నిర్వహించబడేది

## హితకారిణీ సమాజం

హితకారిణి సమాజం అనే పేర ఒక సంఘమును తాము పూనిన కార్యములను నెరవేర్చుటకై 1906లో నెలకొల్పి తన యావద్ధాస్తిని దానికి ఇచ్చి 1908 మే 2 తేదీని లేఖ్యారూఢము (రిజిస్ట్రేషన్) చేయించారు. ఈ ఆస్తులలో పంతులుగారి జన్మగృహం (ప్రస్తుతం 6వ వార్డు) దానికి ఆనుకున్న రాజ్యలక్ష్మినివాస్, ఆనందోధ్యానవనము లక్ష్మివారపు పేటలోని ఇల్లు మొదలైనవి.

1907 సెప్టెంబర్‌లో శ్రీ చిలకమర్తి లక్ష్మీనరిసింహంగారు అప్పటి వరకు నిర్వహించిన మాధ్యమిక పాఠశాలను హితకారిణి సమాజమునకు తీసుకుని నాటి ప్రభుత్వ సహాకారముతో ఇన్నీస్ పేటకు ఆనుకుని ఉన్న 6 ఎకరముల హుంకుంపేట పొలములో పిఠాపురం మహారాజా ధనసహాయముతో చక్కటి హైస్కూల్ భవనాన్ని నిర్మించి ఆ పాఠశాలను నిర్వహించారు. ఇందుకు కంచుమర్తి జమ్మిందారుగారు కూడా సహాయ పడినారు. అప్పట్లో స్త్రీలకు పాఠశాలలో ప్రవేశము లేదు కాని వీరేశలింగంగారు స్త్రీలకు కూడా ఆ

పాఠశాలలో ప్రవేశం కల్పించారు. రెండో విశేషమేమంటే హరిజనులకు కూడా ప్రవేశం కల్పించడం. కలకత్తా సిటీ కాలేజ్ ప్రిన్సిపాల్ శ్రీ హేరంబ చంద్రమైత్ర 1911 సం॥ నవంబరు 27న ఈ పాఠశాల గృహప్రవేశ ఉత్సవము జరిపారు. పాతవూరిలో విశాలమైన స్థలం దొరకనందున వూరికి చివరగా ఆ పొలాన్ని కొని భవనాలను నిర్మించారు. అయితే అవి గట్టి భూములు కానందున గోడలు బీటలు వారునేమోనన్న భయం వారికి వుండేది. అదృష్ట వశాత్తు అలా జరగలేదు. ఇక్కడ ఒక ముఖ్యమైన విషయం మనం ప్రస్తావించుకోవాలి. పాఠశాల వున్న భూమి నల్లరేగడి నూని గడ్డభూమి" అని ఆయన పేర్కొన్నారు ఈ విషయం O N.G C. వారికి పనికి వస్తుందేమో!

వారి అనంతరం ఉన్నత పాఠశాల జూనియర్ కళాశాలగాను, డిగ్రీ కళాశాలగాను అభివృద్ధి గాంచింది ఆనందోద్యానవనములో ఒక భాగంలో ఆయన సతీమణి శ్రీమతి రాజ్యలక్ష్మి పేరుతో స్త్రీల కళాశాల చక్కగా నిర్వహించబడుతోంది ఆయన కాలంలో స్త్రీలకు ఇక్కడ ఒక పాఠశాల నిర్వహించబడేది.

హితకారిణి సమాజానికి మొదటి ట్రస్టీడీడ్‌గా వీరేశలింగం గారే నియమించారు ఈ క్రింది వారిని నియమించారు. 1. శ్రీ కందుకూరి వీరేశలింగం గారు (2) శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడు గారు (3) శ్రీ కార్యూరి వీరభద్రస్వామి (4) శ్రీ ధార్వాడ వెంకట కృష్ణారావు (5) నాళం కృష్ణారావు (6) కనుపర్తి శ్రీరామమూర్తి (7) శ్రీ గంటిలక్ష్మణ (8) శ్రీ చిలకమర్తి లక్ష్మి నరిసింహంగారు (9) శ్రీ కార్యూరి కామరాజు (10) శ్రీ మొక్కపాటి సుబ్బరాయుడు

వై.ఎస్.నరసింహారావు
టవున్‌హాల్ ట్రస్ట్ బోర్డు
సెక్రటరీ

# గోదావరి గట్టు మీద వెలుతురు పిట్టలు

**– సతీష్‌చందర్**

*గోదావరి గాలి తాకినా, నీళ్ళు తాగినా కవిత్వ మొస్తుందంటారు. కాటన్, వీరేశలింగాలు గోదావరిజోలికి పోనంత వరకూ అది ఉత్తపుణ్యగోదావరే అయితే కాటన్ స్పర్శతో పంటల గోదావరి అయ్యింది. కందుకూరి దీక్షలో సాహిత్యగోదావరి అయ్యింది.*

మరి నన్నయో? అనొచ్చు. ఆయన ఆదికవి. పోనీ, తెలుగులో ఆదికవితరాసినకవి. ఆయన నాసికా త్రయంబకం లాంటివాడు. ఆయనకీ మనకీ వెయ్యేళ్ళ దూరం. ఆయన సాహిత్య తీర్థం మన జన సామాన్యానికి అందేదికాదు. అయినా ఆద్యుడు ఆద్యుడేకదా.

మహానుభావుడు వీరేశలింగం "కొట్టుకొని పోయే కొన్ని కోటిలింగాలు వీరేశలింగమొకటి మిగిలినచాలు" అని ఆరుద్ర అన్నప్పుడు ఒళ్ళు గగుర్పొడుతోంది. ఆనందంతో కళ్ళు చెమ్మగిల్లతాయి. ఆయన సాహిత్య గోదావరిని సముద్రపు పాలు కానివ్వకుండా సుక్షేత్రాల వైపు మళ్ళించాడు. ఆయన మనకి లిటరరీకాటన్'

కాటన్ ఆనకట్ట కట్టబట్టే మనం అన్నం ముట్టగలుగుతున్నాం. వీరేశలింగం సాహిత్య చాందసానికి అడ్డుకట్ట వేయబట్టే అందరమూ అక్షరం ముట్ట గలుగుతున్నాం

వీరేశలింగం ఆధునిక తెలుగు సాహిత్యానికి ఆద్యుడు.

ఏది ఆధునిక సాహిత్యం? సమకాలీన సాహిత్యమంతా ఆధునిక సాహిత్యంకాదు. "ఆర్థిక, సామాజిక, రాజకీయ పరిస్థితులు పునాదిగా ఏర్పడిన కొత్త దృక్పథాలను, స్వరూపాన్ని సంతరించుకోవడమే ఆధునికత" ఇలాంటి సాహిత్యానికి కొన్ని కొత్త విలువలుంటాయి. అది ఒక తత్వం.

కందుకూరి వీరేశలింగం ఆకాశంనుంచి ఊడిపడలేదు. ఆనాటి సామాజిక

పరిస్థితులు ఆయన్ని ఆధునికుణ్ణి చేశాయి. అయితే వీరేశలింగం విశ్వమానవుడు. ప్రపంచాన్ని ప్రేమించేవాడు. అందుకే సగం ప్రపంచం (స్త్రీ) చీకట్లో వుండడం సహించలేక పోయాడు. ఆమె చీకట్లో వుందన్న స్పృహ వీరేశలింగానికి కలిగిందంటే – ఆ ఆలోచన వెనుక సామాజిక నే పధ్యం వుంది.

ప్రపంచం ఆర్థికంగా, రాజకీయంగా 17,18 శతాబ్దాల్లో పెనుమార్పులకు గురయ్యింది. పారిశ్రామిక విప్లవం (1748) ఫ్రెంచి విప్లవం (1789) పాశ్చాత్యదేశాల మీద తీవ్రమైన ప్రభావాన్ని చూపాయి. ఒక విప్లవం 'పెట్టుబడి'ని తెస్తే మరొక విప్లవం 'వ్యక్తిగత స్వేచ్ఛ' ను తెచ్చాయి. ఈ రెండూ పాత భూస్వామ్య సంబంధాలమీదా, సంస్కృతిమీదా, సాహిత్యం మీదా ధ్వజమెత్తాయి.

అయితే మనదేశంలో ఈ విప్లవాల ప్రభావం చాలా ఆలస్యంగా పడింది. పాశ్చాత్యదేశాల నుంచి వచ్చిన సాహిత్యం ఇక్ వారి మీద బాగా ప్రభావితం చేసింది. పెట్టుబడి ఆర్థిక విధానం నుంచి ఉత్పన్నమైన ప్రజాస్వామ్య భావనలు భారత మేధావుల్ని, రచయితల్ని ప్రభావితం చేశాయి. అలా ప్రభావితమైన వారే వీరేశలింగం కూడా. ఈ భావనలే ఆయన సంస్కరణా వాదానికి భూమికలు. స్త్రీజాతి సముద్ధరణ, నిరక్షరాస్యతా నిర్మూలన, మూఢ విశ్వాసాల తిరస్కరణ వంటి సంస్కరణలు ఆయన్నీ బాగా ఆకట్టుకున్నాయి. ఈ సంస్కరణా వాదంతోనే తెలుగు సాహిత్యంలో ఆధునికతకు అంకురార్పణ జరిగింది అదీ గోదావరి తీరాన్నే జరిగింది. ఆది కవిపుట్టిన చోటే తొలి ఆధునిక కవీ ఆవిర్భవించాడు ఇందులో ఆశ్చర్యంలేదు. నదికీ నాగరికతకూ వున్న సంబంధమే – నదికీ సాహిత్యానికీ వుంటుంది.



అయితే ఈ ఆధునికతను మరింత ముందుకు తీసుకువెళ్ళిన మహాకవి గురజాడ. ఫ్యూడల్ సంస్కృతి మనకి రాజభక్తిని ప్రభుభక్తిని ప్రభోదిస్తుంది. మన ప్రాచీన కావ్యాలనిండా ఈ భక్తి టన్నుల కొద్దీ దొరుకుతుంది.

కాని గురజాడ 'దేశభక్తి' గురించి మాట్లాడాడు. "దేశమంటే మట్టికాదోయ్

దేశమంటే మనుజులోయ్" అన్నాడు. ఇది ఆధునికత ఈ 'దేశభక్తి' గేయాన్ని "సమస్త ప్రపంచ మహాజనుల జాతీయ గీతం" గా శ్రీ శ్రీ అభివర్ణించారు.

వీరేశలింగం తొలి ఆధునిక కవి అయితే గురజాడ మన ఆధునిక తెలుగు మహాకవి.

వీరేశలింగం సంస్కరణవాద స్ఫూర్తితో పాటు, జాతీయోద్యమం పట్ల మక్కువ పెంచుకొన్న కవి చిలకమర్తి లక్ష్మీనరసింహం" భరత్ ఖండమ్ము చక్కని పాడియావు. తెల్లవారను గడుసరిగొల్లవారు. పితుకుతున్నారు. మూతులు బిగియకట్టి" అన్న చిలకమర్తి మార్కు పద్యమం ఆనాడు ఉద్యమ కారులకు నినాదమయ్యింది. మరి చిలకమర్తి మనగోదావరి పుత్రుడే.



అలాగే భావకవిత్వం పేరు చెప్పగానే గుర్తుకు వచ్చే పేరు దేవుల పల్లి కృష్ణశాస్త్రి. ఈయనది పిఠాపురం. భావకవితోద్యమాన్ని ఒక పార్శ్వాన్నుంచి చూస్తే అదికూడా ఆధునిక విభోద్యనుకు అయితే పాశ్చాత్యదేశాల్లో పెట్టుబడి దారీ విధానం ఫలితంగా వచ్చిన కాల్ప నిరోద్యమానికే ఇక్కడి భావ కవితోద్యమానికి కొన్ని పోలికలు వున్నప్పటికీ రెండూ సారంలో వేర్వేరు. భావకవితోద్యమం వచ్చేనాటికి మనదేశంలో సగం భూస్వామ్యం, సగం ధన స్వామ్యం వుంది. అందుకే మన భావకవిత్వంలో స్వేచ్ఛాప్రియత్వంతో పాటు పాతవిలువలకు వత్తాసు పలికే పునరుద్ధరణ వాదమూవుంది. దేశభక్తితో పాటు దైవభక్తి కూడా వుంది.

కాల్పనిక ధోరణులు భావకవులమీదే కాకుండా, వచన రచయితల మీద కూడా పడ్డాయి. అందులో అగ్రగణ్యుడు చెలం. భావకవులూ, చెలం స్వేచ్ఛనే కోరారు. ఎటొచ్చీ భావకవులు ఆ స్వేచ్ఛకోసం పోరాడలేదు. చెలంపోరాడాడు అంతేతేడా. చెలానికి గోదావరికీ సంబంధంవుంది. చెలం రాజమండ్రిలో వున్నాడు. ఇక్కడ ఆయన 'ఫీలవర్స్ సొసైటీ' పెట్టాడు కూడా. అయితే కృష్ణ శాస్త్రి ప్రభావం అంతాయింతాకాదు. మహాకవి శ్రీ శ్రీ

అంతటివాడే మొదట్లో ఆయన వలలో పడిపోయాడు "హృదయాలను, మానసాలను, కలవరపరుస్తూ అల్లికల్లోలంలా ఘూర్ణిల్లే ప్రమాద ప్రాంతరాలలో కవికి నిరాఘాటంగా విహరించే అధికారంకలదు" అని భావకవుల తరఫున వకాల్తా పుచ్చుకున్నాడు. భావ శృంఖలాలను ఛేదించడమే ఆనాటి ఆధునికత.

ఇదే సమయంలో ప్రకృతిని ఉపాసిస్తూ కవి కొండల వెంకటరావు గారు గోదావరి ఒడ్డున చిన్న సుడిగాలిని లేవదీశారు. ఆయన్నీ ముద్దుగా అందరూ 'ఆంధ్ర వర్డ్స్‌వర్త్' అని పిలుచుకునేవారు.

పోతే గోదావరి ఆవలి ఒడ్డున నండూరి సుబ్బారావు ఉత్త పల్లెటూరి మనసులో 'ఎంకిపాటల్ని' ల్లారు.

'గుండెగొంతుకలోన కొట్టాడు తాదీ

కూకుండ రా కాసింతసేపు"

అంటూ ప్రేయసి ఆత్మ సౌందార్యాన్ని ఆరాధించారు.

ఇది ప్రబంధ కవిత్వం మీద తిరుగుబాటు. స్త్రీ అంగాంగ వర్ణనం మీద ప్రతీకారం. అందుకే భావకవి స్త్రీని 'హృదయేశ్వరి'ని చేసి ఉన్నతాసనం మీద కూర్చోబెట్టాడు ఈ ఆధునికతకుకూడా గోదావరి ఆలవాల మయ్యింది. అయితే భావకవులకు సామాజిక వాస్తవికత పట్లవుండే వైముఖ్యాన్ని ఆధునికతలో జమకట్టకూడదు.

"తన చరిత్రను తనె పఠించి

ఫక్కున నవ్వింది ధరణి

తన చరిత్రను తనెపఠించి

భోరున ఏడ్చింది ధరణి"

ఇది ఆవంత్స సోమసుందర్ చారిత్రక దృష్టి అభ్యుదయ దృష్టి సోమసుందర్‌ది. పిఠాపురం ఎక్కడో జరుగుతున్న తెలంగాణాసాయుధ రైతాంగ పోరాటంలో భాగస్వామ్యం పొందడానికి గోదావరితీరాన నిలబడి తన కలాన్ని కరవాలంలా దూసిన కవి సోమసుందర్. ఆయన 'ఖబడ్దార్' గీతాన్ని ఉద్యమకారులు ఎక్కడబడితే అక్కడ పాడేవారు. ఆ తర్వాత ఆయన

కవిత్వం ఎలాంటి మార్పులకు గురయినా అప్పుడు మాత్రం ఆయన అభ్యుదయ కవిత్వానికి ప్రతినిధి.

ఏమైనా అభ్యుదయ కవిత్వానికి సారధి మాత్రం మన మహాకవి శ్రీ శ్రీయే. 1934 ఏప్రిల్ 12న శ్రీ శ్రీ వ్రాసిన మరోప్రపంచగీతమే అభ్యుదయ కవిత్వానికి ఆరంభగీతం. శ్రీ శ్రీ ప్రభావానికి కృష్ణశాస్త్రికూడా అప్పుడప్పుడూ అభ్యుదయ కవిత్వం రాయల్సిన పరిస్థితి. ఆకాలంలో కలం పట్టిన ప్రతీకవీ అభ్యుదయ కవిత్వమే రాశాడు. సమాజాన్ని పట్టించుకోని కవిని ఆకాలంలో పిచ్చికవిలా చూశారు అప్పుడు గోదావరి తీరంలో ఎందరో యువకవులు అభ్యుదయ పథంలో పయనించారు.

ఆప్రభావమే గోదావరికి పశ్చిమాన వున్న దేవరకొండ బాలగంగాధర తిలక్‌నీ కుదిపింది తిలక్ స్వరూపంలో భావకవి స్వభావంలో అభ్యుదయకవి

శ్రీ శ్రీ మాటల్లో అతనిది.

"కోకిలవలె కూజించే కలధ్వని

కేసరివలె గర్జించే రణధ్వని"

ఆ తర్వాత అద్దేపల్లి రామమోహనరావు, అదృష్టదీపక్ ల వంటివారు ఈ అభ్యుదయ కవిత్వ పంథాలో పయినించారు.

అభ్యుదయ కవిత్వం సైతం మూస పద్ధతిలో వస్తున్నప్పుడు, గతంలో వచ్చిన అన్ని కవితారీతుల మీదా దిగంబరకవులు తిరుగుబాటు ప్రకటించారు. జీవిత వాస్తవికతను చూపించడానికి ధ్వంస రచనచేశారు. నగ్నముని, మహాస్వప్న, భైరవయ్య, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్ లే మనకి దిగంబర కవులుగా తెలుసు.

అయితే వీళ్ళకి ఉద్యమానికి స్పందించిన మరొక దిగంబరకవి గోదావరి తీరంలో వున్నాడు. ఆయనే బి వి.యస్. శాస్త్రి. ఈయన 'మహానగ్న' (బహుశా నగ్నముని, మహాస్వప్నల పేర్లలో సగం సగం తీసుకొనివుంటారు)గా తీవ్రమైన కవిత్వంరాశారు. అయితే ఆయన కవిత్వం అంత ప్రసిద్ధంకాలేదు. అన్ని కవితారీతులకూ గోదావరితీరం స్పందించిందని చెప్పడానికి మాత్రమే ఈ ఉదాహరణ.

ఇక విప్లవ కవిత్వం భూమి కోసం, భుక్తికోసం, దేశ విముక్తి కోసం కవి 'త్వాన్ని సృష్టించాలన్న తపనతో దిగంబరకవులు అభ్యుదయ కవులు సైతం విప్లవకవులుగా మారారు. అందులోనూ శ్రీ శ్రీ యే అగ్రగణ్యుడు. దాదాపు విప్లవకవుల్లో ప్రముఖులందరూ గోదావరి తీరంలో అనుబంధాన్ని పెంచుకొన్నవారే. రాజమండ్రిని ఒక కేంద్రంగా చేసుకున్నవారే.

ఒక ప్రక్కన ఈ ప్రభావం వుంటూండగానే ఇస్మాయిల్, శ్రీమన్నా రాయణ, శ్రీకాంత్ శర్మలు రంగప్రవేశం చేశారు.

తాము ముగ్గురమూ 'అనుభూతి కవులం" అని శ్రీకాంత్ శర్మ ప్రకటించారు. అయితే ఈ 'లేబిల్'ని శ్రీ మన్నారాయణగాని, ఇస్మాయిల్‌గాని ఎప్పుడూ సమర్థించలేదు. అయితే తాము ముగ్గురం "ఇమిడియట్ ఎక్స్‌పీరియన్స్‌కి, అంటే ప్రత్యక్షానుభవానికి రియాక్టయి రాస్తున్నాం" అని ఇస్మాయిల్ అన్నారు. ఇది వారి అభివ్యక్తికి సంబంధించిన విషయం. కాని సారంలో ముగ్గురూ వేరు శ్రీకాంత్ శర్మ సాంప్రదాయకవాది ఇస్మాయిల్ తనకు రాజకీయాలు లేవనే మార్క్సిస్టు వ్యతిరేకి. ఒక్క శ్రీమన్నారాయణ మాత్రం వైయుక్తంగా కనిపించే సామాజికకవి. అయితే ఇలాంటి వైయక్తికం ఎప్పుడూ అపార్థాలకే గురవుతుంటోంది అందుకే సృష్టిలో, సమాజంలో జరిగే వింతల్నీ ముళ్ళ సంకెల్ళతో రోదించే అన్నార్తుల్నీ చూసినప్పుడు" కూడా తానుకవిత్వం రాశానేమోనని ఆయన అనుమానపడ్డారు. ఏమైనా ఈయనదొక కవితారీతి. ఆధునిక గీతి.

విప్లవ కవిత్వం పేరు మీద వచ్చే కొంత అకవిత్వాన్ని చూసి నొచ్చుకున్న వారు 'నిరసన' కవులుగా వచ్చారు వీరు 'అద్వయం భైకొ' పేరు మీద ఈ నిరసన కవిత్వాన్ని అచ్చువేశారు అద్వయం అంటే అబ్బూరి, అత్తలూరి, భై – అంటే భరవయ్య. కొ–అంటే కొత్తపల్లి శ్రీమన్నానారాయణ వీళ్ళకోపమంతా విప్లవ కవిత్వరూపం మీదేకాని సారం మీద మాత్రం కాదు. సాహిత్యోద్యమం చరిత్రలో కేవలం రూపప్రధానమైన ఉద్యమాలు నిలువలేకపోయాయి. 'మినీ కవితోద్యమమూ' అంతే మినీకవిత్వ భారీ ప్రచారం ఇవ్వడంలో తూర్పుగోదావరి

అగ్రగామిగా వుంది. కొల్లూరి వంటివారు ఈ ఉద్యమాన్ని భుజాన వేసుకొని తిరిగేవారు.

ఇక ఇప్పుడు, ఒక దశాబ్దకాలంలో తెలుగులో మంచి కవిత్వమొస్తుంది. సామాజికానుభూతుల్ని కొత్తపదబంధాలతో, కొత్తపదచిత్రాలతో పలికిస్తున్నారు. ఇప్పుడు కవిత్వం గుండెకు సూటిగాతగుల్తోంది. ఇలాంటి గొప్ప కవిత్వాన్ని సృష్టిస్తున్న వాళ్ళల్లో మొదటి తరగతికి చెందిన వారు రాయలసీమలో సొదా అయితే గోదావరి జిల్లాల్లో వసీరా "కాళ్ళు తడవకుండా సముద్రాన్ని దాటగల మేధావికూడా కళ్ళు తడవకుండా జీవితాన్ని దాటలేడని సహజమైన కవిమాత్రమే అనగలడు ఆమాట వసీరా అన్నాడు.

ఈ దశాబ్దంలో స్త్రీల స్వేచ్ఛ పట్ల, దళితుల విముక్త పట్ల కవుల, కవయిత్రుల దృష్టి మళ్ళింది. దళిత హృదయాన్ని కవిత్వంలో చూపించిన గొప్పకవి శిఖామణి . ఈయనది యానాం అంటే దాదాపు తూర్పుగోదావరే అలాగే పి. పద్మావతి, వి. పద్మలు స్త్రీవేదనవీ ప్రతిఘటననీ కవిత్వంలో బలంగా పలికిస్తున్నారు. వీరూ గోదావరి తీరంలో వారే.

ఇంకా తల్లావజ్ఝల పతంజలి శాస్త్రి, కొప్పర్తి, సాదనాల వెంకటస్వామి నాయుడు, ఎమ్మెస్. సూర్యనారాయణ, రవూఫ్ వంటివారు మంచి ఆధునిక కవిత్వాన్ని అచ్చు వేశారు. పెమ్మరాజు గోపాలకృష్ణ మంచి కవితాసంకల్పాన్ని వేయబోతున్నారు. అయితే ఆమధ్యకాలంలో 'అస్పష్టత' అనేది సైతం ఒక కవితా ధోరణిగా వచ్చింది. ఆ ధోరణికి చినవీరభద్రుడు గురయ్యారు. నిజానికి భద్రుడు బలమైనకవి. కాని ఈ అపసవ్యధోరణి ఆయన్ని కబళించింది.

రేపు గోదావరి తీరంలో వెలుగును ప్రసరింపచేసే వెర్రిగొంతుకుల కొన్ని యిప్పుడిప్పుడే విచ్చుకొంటున్నాయి. వాళ్ళే ఎన్‌క్యూబ్, శ్రీధర్, రమేష్, చక్రపల్లి శ్రీను, శశిలు వీళ్ళది రేపటి శైలి.

ఇప్పుడు కవిత్వం సొంత బాధలా కనిపించే ప్రపంచం బాధ.

# తొలినాటకంతో తెలుగు నాటక వికాసం

– పతివాడ సూర్యనారాయణ

ఆంధ్రుల సాంఘిక సాహితీ సంస్కృతిక రంగాల్లో మార్పుకు, మలుపుకు నాందీ వాక్యం పలికిన రాజమహేంద్రవరంలోనే తొలి నాటక ప్రదర్శనానికి కూడా అంకురార్పణ జరిగింది.

తొలి తెలుగునాటక ప్రదర్శన "వ్యవహారా ధర్మబోధిని" ప్లీడర్ల నాటకం 1880లోనే విద్యార్థులతోను, అధ్యాపకులతోను రాజమండ్రిలోనే ప్రదర్శించారు. యీ ప్రమాణంతోనే 1980లో ఆంధ్ర నాటక శత జయంతి జరుపుకున్నాం. తెలుగులో సకల సాహితీ ప్రక్రియలకు, సంస్కరణోద్యమాలకు ఆధ్యుడు, వైతాళికులకు వైతాళికుడైన శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారే దీనికి రచయిత, ప్రయోక్త కూడాను.

అదే సంవత్సరంలో సకల హంగులతో ధార్వాడ నాటక సమాజము వారు ప్రదర్శించిన తాటియాకు పాకాలలోనే "రత్నావళి", "చమత్కార రత్నావళి" ప్రదర్శింపజేశారు. పాత్రధారలు స్థానిక కాలేజి విద్యార్థులే. ఆ విధంగా ఔత్సాహిక నాటక రంగానికి కూడా శ్రీ కందుకూరి వేరే ఆధ్యులు కావడం విశేషం.

తొలి తెలుగు నాటకం "మంజరీ మధుకరీయం" 1860 నాటకకర్త శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి వృత్తిరీత్యా బందరు నోబుల్ కళాశాల అధ్యాపకులైన వారి స్వగ్రామం తూర్పు గోదావరి జిల్లాలోనిదే, కాని రాజమండ్రి వాసులైన, శ్రీ కొక్కొండ వెంకట రత్నం పంతులుగారి "నరకాసుర విజయ వ్యాయోగము" తొలి ముద్రణ పొందిన నాటకమయ్యింది నరకాసుర విజయ వ్యాయోగము ఒక విధముగా చూస్తే ఏకాంకికగా పేర్కొనవచ్చు. వారే ఏకాంకికులకు కూడా ఆధ్యులు అని చెప్పవచ్చు.

వావిలాల వాసుదేవ శాస్త్రిగారు మరో నాటక ప్రక్రియలో ఆధ్యులు. వారి "నందకరాజ్యం" ప్రథమ సాంఘిక తెలుగు నాటకం కావడం, ప్రథమ పద్య

నాటకం కావడం మరో విశేషం. వావిలాల వారు షేక్స్పియర్ "జూలియస్ - సీజర్" తర్జుమాచేసి తెలుగువారిలో ప్రథముడుగాను, దేశభాషల్లో ద్వితీయుడుగాను పేరు ప్రఖ్యాతులు గాంచారు. వీరు కూడా రాజమండ్రి వాసులై, శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహం శ్రీ వడ్డాది సుబ్బారాయుడు, శ్రీ పానుగంటి లక్ష్మీ నరసింహారావు గార్లకు ఈ ముగ్గురు నాటక కర్తలే గురువులవడం అదృష్టం. రాజమండ్రి నాటక చరిత్రలో మరో మైలురాయి "వేణీ సంహారము" నాటక ప్రదర్శన, నాటకకర్తయిన శ్రీ వడ్డాది సుబ్బారాయుడు గారు వసురాయ కవిగా, భక్తా, చింతామణి కృతికర్తగా ప్రసిద్ధులు. "వేణీ సంహారము" తెలుగునాట అర్ధ శతాబ్దము జైత్రాయాత్ర చేసింది. దీనిని ప్రదర్శించని తెలుగునాటకసమాజమే లేదటః వ.సు. రాయకవి ప్రథమ సమాజ స్థాపకులుగా కవి, నటుడు, దర్శకుడుగా కీర్తికరించారు.

లక్షప్రతుల విక్రయం

తొలి నాటక కర్తలలో శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహాగారికొక విశిష్ట స్థానముంది. వీరి "గయోపాఖ్యానం" నాటకం నేటికి విజయభేరి మ్రోగిస్తుంది. 1942 నాటికే లక్ష ప్రతులు అమ్ముడు పోయి రికార్డు సృష్టించింది. నేటికి సజీవంగా శతజయంతి జరుపుకున్న నాటకం యిది. మరో ప్రసిద్ధ నాటక కర్త "సాక్షి". గ్రంథకర్త పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారు రాజమండ్రి సమీప గ్రామం సీతానగరం కావడం మన అదృష్టం. వారి "పాదుకాపట్టాభిషేకం" "రాధాకృష్ణ". "విప్రనారాయణ", "కంఠాభరణం" ఉన్నతో నాటక శిల్పానికి ప్రతీకలు. వారు పిఠాపురం సంస్థానంలో నాటక వికాసానికి ఎంతో తోడ్పడ్డారు.

తిరుపతి వెంకట కవులుగా ప్రసిద్ధులైన మహాకవులలో ఒకరైన చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు జగత్ విఖ్యాతులు, వారు కూడా రాజమండ్రి సమీప గ్రామం కడియం వాసులే. వారి 'పాండవోద్యోగ విజయములు" బహుళ ప్రచారము పొంది నేటికీ "కురుక్షేత్రం" పేరుతో విజయపరంపరల పొంది, కాంట్రాక్టు, నాటకాలకు కొంగుబంగారమైంది.

చారిత్రిక, రాజకీయ, దేశ, రాష్ట్ర భక్తి పూర్వకమయిన నాటక రచనల్లో

కూడా ముందే నిలిచారు. శతాధిక గ్రంథకర్త, శ్రీపాద కృష్ణమూర్తి గారి చారిత్రక నాటకం "బొబ్బిలియుద్ధం" బహుళ జనాధారణ పొంది, చరిత్ర సృష్టించింది. వారి "గాంధీ విజయ ధ్వజము", "స్వరాజ్యోదయము" నాటకాలు దేశభక్తికి నిదర్శనాలు నండూరి బంగారయ్య "ఆంధ్రతేజం" రాష్ట్రభక్తికి నిలువుటద్దం.

ఆంధ్ర నేతాజీ నిష్కళంక దేశభక్తుడు శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారు "చిచ్చులపిడుగు" 1929 ప్రాంతంలో వారు సంపాదకులుగా వున్న కాంగ్రెస్ పత్రికలో ప్రచురించారు. 1857 ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రకు సంబంధించిన నాటకమది. ఈ విధంగా తొలి విప్లవ నాటకానికి కూడా రాజమహేంద్రవరమే కేంద్రమయింది.

తొలి నాటక కర్తలలో రాజమండ్రి వాస్తవ్యులు శ్రీ ద్రోణంరాజు సీతారామారావు గారొకరు. రాజమండ్రి గున్నేశ్వరరావుగారి నాటక సమాజానికి, బందరు నాటక సమాజాలకు ముప్ఫై నాటకాల వరకు రచించడం జరిగిందట.

1880 నుండి సుమారు 20 సంవత్సరాల వరకు ఔత్సాహిక నాటక యుగంగా నిర్ణయించారు. ఈ కాలంలో వెలసిన నాటక సంస్థలు, నటులు ఔత్సాహిక నాటక యుగానికి ప్రతీకలే.

హిందూ నాటకోజీవక సమాజం, రాజమండ్రి 1884 వడ్డాది సుబ్బారాయుడుగారు దీని వ్యవస్థాపకులు. నటులు శ్రీయుతులు కనపర్తి శ్రీరాములు, సుసర్ల శ్రీనివాసరావు, సుసర్ల శ్రీఅనంతరావులు.

మరో ప్రతిష్టాకరమయిన సంస్థ హిందూ నాటక సమాజం, రాజమండ్రి 1889 ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు గారి గురుపాదులు శ్రీ ఇమ్మానేని హనుమంతరావు దీని వ్యవస్థాపకులు. చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు సహజకవి, వీరు ప్రస్తుత వీరేశలింగంగారి పురమందిరం ప్రక్క దివాన్ దేవిడిలో పాకలువేసి హాలు నిర్మించారు. ప్రకాశం పంతులుగారు స్త్రీ పురుష పాత్రలను సమర్థవంతంగా నటించేవారట. ఇతర నటులు శ్రీ మద్దూరి నాగభూషణం, దుర్గి గోపాలకృష్ణ అయినవోలు తాతయ్యనాయుడు, ఎర్రాగరల సత్యరాజా, రాజగోపాలం, నెప్పార్లి బుల్లికృష్ణయ్య, యాతగిరి పూర్ణయ్య.

1901 లో శ్రీ చిలకమర్తివారు అధ్యక్షులై యీసంస్థను పునరుద్ధరించారు. కుమ్మరి గుంట (నేటి ట్రయినింగు కాలేజీ ఆవరణలో) నాటకాలు ప్రదర్శించారుఎ. శ్రీ ముప్పిడి జగ్గరాజు కూడా నాయిక పాత్రలు ధరించే వారు.

తరువాత కాలాన్ని అంటే 1928 వరకు వృత్తి నాటక యుగమన్నారు. 1898 నాటికే వృత్తి నాటక సమాజాలు ఏర్పడినాయి. తరువాత విస్తృతమై స్వర్ణయుగాన్ని సృష్టించాయి. దీనికి కూడా రాజమండ్రియే కేంద్రము, నిలయము కూడాను.

1891 మానేపల్లి కంపెనీ రాజమండ్రి స్థాపన మానేపల్లి వాస్తవ్యులు శ్రీ ధరణిప్రగడ సూరయ్య "నేషనల్ థియేటర్" పేరుతో సమాజాన్ని స్థాపించారు. వారి ఊరు పేరును బట్టి మానేపల్లి కంపెనీగానే స్థిరపడింది. ఇదే ప్రథమ వృత్తి నాటక సామాజం అన్నారు. ఈ సమాజం నెల జీతాలతో నటుల్ని ప్రోత్సాహించారు. అంబడిపూడి కోటయ్య నాయకపాత్రధారి, స్త్రీ పాత్రలో తనకుతానే సాటైన శ్రీ ముప్పిడి జగ్గరాజు వీరి సమాజ నటులు 1912 వరకు ఈ సమాజం ఎంతో విజయవంతంగా నడిచింది.

హిందు నాటక సమాజాన్ని శ్రీ సత్యవోలు గున్నేశ్వరరావు రాజమండ్రి కరణం కృత్తివెంటి నాగేశ్వరరావు గార్లు ఈ సంస్థను శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహారావు గారి నుంచి తీసుకొని ఎంతో పెద్ద ఎత్తున ప్రారంభించారు. ఇది రాజమండ్రి నాటక చరిత్రలోనేకాక, ఆంధ్ర నాటక చరిత్రలోనే చెప్పుకోదగ్గ మహాసంస్థ. ఆరోజులలో లక్ష యాభై వేలు వరకు ఖర్చు పెట్టారని, నటులు, సిబ్బంది. వందకు పైనే వుండేవారని చెప్పేవారు.

ఎ.యస్.రామ్ అనే ప్రసిద్ధ చిత్రాకారున్ని బొంబాయి నుండి రప్పించారట. నాటక వాగ్గేయకారుడైన పాపట్ల కాంతయ్యగారిని పాటలు కూర్చి, శిక్షణ యివ్వడానికి రప్పించారట. తెలుగు నాటకాలలో నృత్యాలు కూడా ఈ సమాజంలోనే ప్రారంభమయ్యాయి. కవికోకిల జాషువాను రచనకు

నియమించారు. హరికథ పితామహుడు శ్రీ ఆదిభట్ల నారాయణదాసు యీ సమాజంలో భీమ పాత్రధరించేవారట. నాగేశ్వరరావుగారు విడిపోయిన తరువాత గున్నేశ్వరరావు గారు "చింతామణి నాటక సమాజాన్ని" నెలకొల్పేరు. ఈ సంస్థ 1927 వారి మరణం వరకు నడిచింది. ఈ సంస్థ సత్ సాంప్రదాయాల్ని నెలకొల్పి వసుమర్తి వారన్నట్లు వర్తక మర్యాదలు తెచ్చిపెట్టి నాటక చరిత్రలో స్వర్ణయుగానికి బాటలు వేసింది. బ్రహ్మజోశ్యుల సుబ్బారావు, వెల్లంకి వెంకటేశ్వర్లు, ముప్పిడి జగ్గరాజు, నిడసనమెట్ల కొండలరావు, మద్దాలి శేషగిరిరావు, అవదాన్ల పురుషోత్తం, దుర్గి గోపాలకృష్ణరావు, వై. భద్రాచారి, కుంపట్ల సుబ్బారావు (సినీనటుడు) ఆనాడు ముఖ్యనటులు.

ఈ కాలంలోనే ఔత్సాహిక నాటక సమాజాలు కూడా వృత్తి నాటక పోకడలోనే వర్థిల్లాయి. ప్రధమ నాటక విమర్శకులు శ్రీ శ్రీపాద కామేశ్వరరావు, శ్రీ అంకరాజు రామారావు 1909లో రాజమండ్రి అమెచ్యూర్స్ సంస్థను నెలగొల్పి ఎన్నో ఉత్తమ ప్రదర్శనాలను శ్రీ శ్రీపాదవారి శిక్షణలో ప్రదర్శించారు అదే సంస్థ 1920లో "కేశరి" సమాజంగా రూపొందింది. శ్రీ పెమ్మరాజు రామారావు, శ్రీ జయంతి గంగన్న, శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు, శ్రీ పాణంగి జోగిరాజు, శరభరాజు, శ్రీ ఏలూరు పాటి వెంకటరత్నం, బ్రహ్మజ్యోశుల సుబ్బారావు, శ్రీ మాచిరాజు రామచంద్రరావు బండరాముడు, శ్రీ కొచ్చర్ల కోట సత్యనారాయణ, శ్రీ ద్రోణంరాజు చినకామేశ్వరరావు, శ్రీ దినవహి సత్యనారాయణ, ప్రముఖ హరికథకులు శ్రీ బుద్ధవరపు కురంగీశ్వర రావు, శ్రీ మహిపాల రామన్న, శ్రీ పార్సే శేషగిరిరావు, ముఖ్యనటులు శ్రీ శ్రీపాద కామేశ్వరరావుగారు మహారాష్ట్ర, బెంగాలీ, హిందీ, ఒరియా, తమిళం, ఇంగ్లీషు, ఫ్రెంచి, పంజాబీ భాషలనుండి ఎన్నో నాటకాలు తర్జుమా చేశారు.

తెలుగు నాటక రంగపు తొలిరోజులలో పైనుదాహరించిన నటులేగాక మహోజ్జ్వలంగా వెలుగొందిన మహానటులు ఎందరోవున్నారు. అభినవ దుర్యోధనుడు యస్.పి.యల్. నరసింహాచారి గారు, శ్రీ యుతులు కత్తుల కృష్ణరావు

భాగవతార్, దోమ్మేటి సత్యనారాయణ, ఆంధ్ర చార్లీ బాబ్జి,స్త్రీలలో గంగారత్నం, సరోరుహం, టేకి అనసూయ తదితరులు. ఆనాటి హార్మోనిస్టులలో కోటిలింగం, భుజంగరావు, చింతా సుబ్బారావు, ధనవాడ రాఘవరావు, మృత్యుంజయుడు, టి.వి.రాజు సత్యహరనాధ్, గుడిమెట్ల గంగరాజు ముఖ్యులు. అలానే తబలిస్టులుగా కొండలరావు, చిట్టిబాబు, బాజీ, నట్టాకృష్ణ ముఖ్యులు. మేకప్ ఆర్టిస్టులుగా నట్టా సూర్యం కుమార్ ముఖ్యులు.

## నూతన ప్రయోగాలు

తరువాత తరంలో కొన్ని నూతన నాటక ప్రయోగాలు జరిగాయి. రచనలలో వ్యంగం, చమత్కారమే కాకుండా పర్వతాలు, పానకాలు, మాలోకం, శీనయ్య, శరగోపం లాంటి పాత్రలను సృష్టించి ఆంధ్రులకు అందించిన హాస్యబ్రహ్మ శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు, కధక చక్రవర్తి శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, విద్వాన్ సహదేవ సూర్యప్రకాశరావు (విషపాత్ర) అద్యాంతాలు, అనార్కలి, మీరాబాయి, నర్తకి దినవహి సత్యనారాయణ (షాజహాన్) రాజమండ్రి వాసులే కావడం విశేషం

తెలుగు నాటిక సాహిత్యంలో నూతన అధ్యాయాన్ని, విన్నూతన విధానాన్ని సృష్టించిన 'తప్పెవరిది' 1929 నాటిక రచయిత కీ.శే. పాకాల వెంకట రాజమన్నార్ మద్రాసు హైకోర్టు పూర్వపు ప్రధాన న్యాయమూర్తి కూడా రాజమండ్రి వారే. ఈనాటికి గొప్ప చంచలనాన్ని సృష్టించి, అప్పటి వరకు ఉన్న నాటక రీతుల్ని మార్చివేసి రానున్న నాటికోద్యమానికి, ఔత్సాహిక ఉద్యమానికి చక్కని బాటవేసింది. ఈ నాటికను శ్రీ బళ్లారి రాఘవచారి 1929లో బెంగుళూరులోను, 1930లో మద్రాసులోను ప్రదర్శించారు. రాజమన్నారు కలం నుండి నిష్పలం, ఏమి మగవాళ్లు, దయ్యాల లంక, నాగుపాము, విముక్తి వంటి నాటికలు వెలువడ్డాయి. మరో నూతన అధ్యాయాన్ని, విన్నూతన ప్రక్రియలు చేపట్టిన వైతాళికుల సంకలనకర్త, అశోకం టీ కప్పులో తుఫాన్, అపవాదు, అనార్కలి మొదలైన నాటకాల రచయిత శ్రీ ముద్దుకృష్ణగారి

అనార్క్లీ రేడియోలో ప్రసారమయిన మొట్టమొదటి నాటిక.

1929 లో ఆంధ్ర నాటక కళా పరిషత్ ఏర్పడిన ఉత్సాహంలో రాజమండ్రిలో కూడా స్పందన ఏర్పడి అనేక సంస్థలు ఉద్భవించాయి. రాజహంస డ్రమెటిక్ అసోసియేషన్ రాజమండ్రి 1936, గున్నేశ్వరాయ నాట్యమండలి, రాజమండ్రి 1940, ట్వెంటియత్ సెంచరీ స్వాన్ క్లబ్, రాజమండ్రి 1944. పై సంస్థలలో ప్రధాననటులు శ్రీ యుతులు యం.పి.యల్. నరసింహాచారి, కోలవెన్ను కామేశ్వరావు, దేవత సుబ్బారావు, తులసి కామేశ్వరరావు, రావుఅపర్తి సూర్యనారాయణ, యం.వి.రాజపాయ్, శ్రీ పాదపట్టాభి, నండూరి రామమోహన రావు ఆంధ్రజ్యోతి సంపాదకులు, పతివాడ సూర్యనారాయణ వ్యాసరచయిత, కస్తూరి, రాఘవకుమారి, అమ్మాజీ, కాళ్ల సుగణ, మాణిక్య కుమారి ఇత్యాదులు. ద్రోణంరాజు చినకామేశ్వరరావు ఆనాటి ఎన్నో సంస్థలకు దర్శకులు.

తెలుగునాటక చరిత్రలోనూ నూతనయుగం, నవశకం 1943-45 ప్రాంతంలో ఏర్పడింది. అదే ఔత్సాహిక నాటక రంగాన్ని పునరుజ్జీవింప చేయడం. దాని ప్రధాన కారకులలో వృత్తిరీత్యా, ప్రవృత్తి రీత్యా రాజమండ్రి వాస్తులైన డాక్టర్ గరికిపాటి రాజారావు. ప్రజానాట్య మండి సారధియై, రాజమండ్రిలో రాఘవ కళా సమితి 1950 స్థాపించి రాజమండ్రి నాటక చరిత్రలో చంచలనం సృష్టించారు. రాఘవ కళా సమితి ఎన్నో విజయాలు సాధించింది. నటులు, సంస్థ, ప్రయోక్తలు ఎన్నో పురస్కారాలు పొందారు. రాఘవ కళా సమితి, రాజమండ్రిలో ఆంధ్ర థియేటర్స్ ఫెడరేషన్ సభ్యులు - శిక్షణా తరగతులు - విశాలాంధ్ర సాంస్కృతి సభలు ఉన్నత స్థాయిలో నిర్వహించి తెలుగు నాటకానికి ఎంతోసేవ చేశారు. అంకరాజా శంకరరావు, మోడూరి వెంకన్న, యాసంరెడ్డి వెంకటరావు, శ్రీపాద పట్టాభి, వై. సత్యనారాయణ, నాగేంద్రజీ, శ్రీమతి లక్ష్మి, శ్రీమతి శాంతముఖ్య నటులు.

అలానే ఈనాటి నాటక రంగానికి ఒక బాట, తనదంటూ ఒక బాణీ, తనను అనుకరించేవారిని, అనుసరించే వారిని సృష్టించిన నటరాజా శ్రీ కె. వెంకటేశ్వరరావు కూడా తన విద్యార్థిదశ తన నటనకు అంకురార్పణ

రాజమండ్రిలోనే జరిగింది.

రాజమండ్రి నాటక కర్తలలో చెప్పుకోదగిన వారిలో శ్రీ పడాల రామా రావు (అల్లూరి సీతారామరాజు నేతబిడ్డ, సందేశం) శ్రీ జనమంచి రామకృష్ణ బాలనాటికలలో ప్రసిద్ధులైన శ్రీ చెరుకుమిల్లి భాస్కరరావు, శ్రీమతి అద్దేపల్లి వివేకానందదేవి, శ్రీమతి కోడూరి లీలావతి (బాలచంద్రిక సాహిత్య అకాడమీ పురస్కారం పొందినది) నూతన ప్రయోగాలతో చంచలాన్ని సృష్టించి, అధునిక నాటకరంగాన్ని మరో మలుపు త్రిప్పిన 'మరో మొహంజదారో' నాటక రచయిత శ్రీ యన్.ఆర్.నంది, కీర్తిశేషులు నాటకకర్త, రచయిత శ్రీ యన్.ఆర్.నంది కీర్తిశేషులు నాటకకర్త, రచయిత, శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ రాజమండ్రి ఊరుమ్మడి బ్రతుకులు "రచయిత శ్రీ సి.యస్.రావు రాజమండ్రి వేరే కావడం రాజమండ్రి నాటక చరిత్రలో గర్వింపదగిన విషయం.

పోటీ నాటకాలలో రాజమండ్రివారు విజయ పరంపరాలు సాధించారు. రచయితలలో శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ, శ్రీ యన్.ఆర్. నంది, శ్రీ సి.యస్రావు ముఖ్యులు. నటులలో నటరాజు శ్రీ కె. వెంకటేశ్వరరావు, డా. జి. రాజారావు, అంకరాజు శంకర్రావ్, శ్రీ పాద పట్టాభి, శ్రీ బొడ్డు బుల్లాబ్బాయ్, శ్రీ నీలపాల సుబ్రహ్మణ్యం, శ్రీ ప్రసాదుల గురుమూర్తి, శ్రీమతి లక్ష్మి, శ్రీమతి శాంత, పద్మలత, నేడు శ్రీ టి.జె. రామనాధం, శ్రీ యం. ప్రసాదమూర్తి, శ్రీ మణికుమార్, శ్రీ జిత్ మోహన మిత్రా, శ్రీ బూరా రాము, మరెందరో ఉన్నారు. స్త్రీలలో ఉమా, శ్రీ లేఖలను చెప్పవచ్చు.

ఆంధ్ర నాటక కళాపరిషత్ నాట్యసంఘం వారిచ్చిన పోత్సాహంతో ఆంధ్రదేశం నలుమూలల నాటిక, నాటక పోటీల నిర్వహణ సంస్థలు ఎన్నో ముందుకు వచ్చాయి. దానిలోను రాజమండ్రిదే అగ్రతాంబూలం. ముఖ్యంగా రాజమండ్రిలో లలితా కళా నికేతన్ యల్.కె.యన్ 1953 నిర్వహణ, నాటక పోటీలు తెలుగునాట నూతనోత్సాహాన్ని కలిగించింది. ఎన్నో సంస్థలకు ఆదర్శమయింది. రజితోత్సవం, దశమ పోటీలు నిర్వహించి నూతన చరిత్రను సృష్టించింది. దీని మూలపురుషులు శ్రీ కొండపల్లి భాస్కరరావు, శ్రీ ఏలేటి

శేషగిరిరావు, శ్రీ తన్నీరు బుల్లయ్య మాజీ యం.యల్.సి నవభారత్ గురుకుల కులపతి ఆశీస్సు అండదండలు వుండి వారి గురుకుల ఆవరణలో పోటీలు, కళాకారులకు వసతి సౌకర్యాలు ఏర్పాటు చేశారు. ఆ నాలుగురోజులు పండుగులా జరిగేవంటే అతిశయోక్తి కాదు, చర్చలు, గోష్ఠులు ఏర్పాటుచేసి, మంచి అవగాహన కలుగచేసేవారు.

మరో ఉత్తమ సంస్థ కల్చరల్ ఆర్ట్స్ సెంటర్, రాజమండ్రి 1964 మొదట పట్టణస్థాయిలోను తరువాత జిల్లా స్థాయిలోను, చివరకు రాష్ట్ర, రాష్ట్రేతర సంస్థల పోటీలు రాజమండ్రి అప్సరా హోటల్ మేడపై ఆరుబయలు ఆడిటోరియంలో జరిగాయి దీనికి వెన్నెముక శ్రీ దాకారపు సుబ్బారావు, శ్రీ బొలిశెట్టి మోహనరావు, శ్రీ కంచుమర్తి శ్రీరాములు, శ్రీ ఎ.సి.వై. రెడ్డి (ప్రస్తుత శాసనసభ్యులు) శ్రీ జూపూడి వెంకటేశ్వరరావు, కొత్త రాంబాబు పోత్సాహం ఎంతైనా ఉండేది

నటమిత్ర శ్రీ పి బి వీరాచారి మొదట స్థానిక కళాపరిషత్‌గాను, తరువాత రాజమహేంద్ర వరకళా పరిషత్‌గాను తొమ్మిది నాటకోత్సవాలు చేసి ప్రోత్సాహం లేక విరమించుకున్నారు అలానే శ్రీ నల్లా సూర్యనారాయణ, నవ్యకళాపరిషత్ పేరుతో రెండు సంవత్సరాలు నడిపి విరమించుకున్నారు

ప్రస్తుతం అల్లూరి సీతారామరాజు, ఆంధ్ర శ్రీ కల్చరల్ అసోసియేషన్ సారధి శ్రీ పడాల వీరభద్రరావు, శ్రీ యేడిద గనేశ్వరరావు, శ్రీ యల్. యస్. యస్ రాజు ఏకపాత్రాభినయాల పోటీలు నిర్వహిస్తున్నారు.

నటుడు, ప్రయోక్త, శ్రీ యం. ప్రసాదమూర్తి తన తండ్రి పేరుతో ముదునూరి రామన్న స్మారక కళావేదికగా స్థాపించి రాష్ట్ర స్థాయి పోటీలు రెండు సంవత్సరాల నుండి చక్కగా నిర్వహిస్తున్నారు. అదే ఆశాకిరణం ఆమధ్య కాలంలో ప్రజనాట్యమండలి, వంగవీటి మోహనరంగా స్మారక నాటక పోటీలు, ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఎలక్ట్రిసిటీ బోర్డు వారి నాటక పోటీలు రాజ మండ్రిలో నిర్వహించారు.

లలితా కళానికేతన్, కల్చరల్ ఆర్ట్సు స్థాయిలో పరిషత్‌లు నడిపే

సంస్థలు రాజమండ్రిలో కొరవడ్డం చాలా నిరాశజనకమే. నాటకరంగానికి మంచిరోజులు వస్తాయని పూర్వ ఔన్నత్యాన్ని నిలుపుతారని ఆశిద్దాం. రాజమండ్రిలోను పరిసర ప్రదేశాలలోను ఎన్నో సంస్థలు వెలిశాయి. ఇప్పటికిఎన్నో సంస్థలు వర్థిల్లుతున్నాయి. 1972 నాటికి 37 సంస్థలున్నట్లు తెలుస్తూవుంది. సంస్థలన్నింటిని కలపడానికి, శ్రీయుతులు లోలుగు అప్పాజీ, దాకారపు సుబ్బారావు, మహంతి (పుట్రేపు సుందరరావు) వీరాచారి నాయకత్వంలో ఒక ప్రయత్నం జరిగింది. అదే 'రాటా' రాజమండ్రి అమోచ్యూర్ థియేటర్స్ అసోసియేషన్.

రాజమండ్రి నాటక చరిత్రలో చిరస్థాయిగా జ్ఞాపకముండే ప్రదర్శనలు యీ మధ్య కాలంలో చూడడం జరిగింది. ఆంధ్రప్రదేశ్ నాటక ఎకాడమీ వారు తెలుగు నాటక నూరేళ్ల ఉత్సవాల్ని పురస్కరించుకొని వేదంవారి 'ప్రతాపరుద్రీయం' ఎ ఆర్.కృష్ణ కొప్పరపు వారి 'అల్లిమురా' కర్నాటి ఇత్యాధులు ప్రదర్శించారు అలానే తెలుగు యూనివర్సిటీ వారు, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డా. సి. నారాయణరెడ్డిగారి నేతృత్వంలో తెలుగు విశ్వవిద్యాలయం డీన్ ఆచార్య శ్రీ బేతవోలు రామబ్రహ్మం, శ్రీ పతివాడ సూర్యనారాయణ కార్యనిర్వహణలో కృష్ణ లీలలు (సురభి) వనవాసం కడప సవేరా ఆర్ట్సు, హరిశ్చంద్ర పాన్నాల రామసుబ్బారెడ్డి, చింతామణి శ్రీ బుర్రా సుబ్రహ్మణ్యశాస్త్రి ప్రదర్శనాలు ఏర్పాటు చేశారు.

ప్రఖ్యాత నటులు శ్రీ టి.జె. రామనాధం దర్శకత్వంలో నన్నయ భారతావరణ,నటులు, ప్రయోక్త శ్రీ కొప్పర్తి అమరలింగేశ్వరరావు దర్శకత్వంలో 'నిరుడు కురిసిన హిమ సమూహాల' పేరుతో పాత నాటకాలు సంవత్సరం పాటు ప్రదర్శన. అలానే ఇటీవల కాలంలో జిల్లా పౌరసంభాధి కారి శ్రీ భమిడిపాటి సూర్యనారాయణ మూర్తి గారి ఆధ్వర్యంలో జిల్లా మహిళా ఉత్సవాల సందర్భంలో ఏకపాత్రాభినయం పోటీలు, వి.లక్ష్మి ఆధ్వర్యంలో స్థానిక మహిళా కారాగారంలోని మహిళల నాటక ప్రదర్శన చెప్పుకోతగ్గవి. మయూరి కళా సమితి ఆధ్వర్యంలో శ్రీ భమిడి పాటి రాధాకృష్ణనాటకోత్సవాలు

మరో నూతన ప్రయోగం.

నాటక కర్తలలో పేర్కొనవలసిన వారిల్లో మహాకవి కళాప్రపూర్ణ శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, ప్రస్తుత రాజమండ్రివాస్తులైన ఆచార్య బేతవోలు రామబ్రహ్మం(డీన్) స్థానిక తెలుగు యూనివర్సిటీ గార్లు ప్రముఖులు. ఇంకా శ్రీ యుతులు మానాపురం అప్పారావు పట్నాయక్, పింగళి వెంకట్రామయ్య, వద్రేవు కామరాజు, గంటా నూరాపతి (జి.యన్.పతి) కె. వీర్రాజు అలెగ్జాండరు, బొత్సకవి, వాడ్రేవు గవర్రాజు, పడాల రామకృష్ణారెడ్డి, సన్నిధానం నరసింహాశర్మ నాటక పద్యాలు, ఏకాంకికలు బొమ్మకంటి వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రి ఏకాంకికలు బొమ్మకంటి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి ఏకాంకికలు, యం.పి. నారాయణచార్యులు, పంపన సూర్యనారాయణ, పతివాడ సూర్య నారాయణ ముఖ్యులు.

నటుల్లో శ్రీ యుతులు అమరనాధ్, రాజబాబు, యం.బి.బి.యస్.ఆర్. శర్మ, యం.పి. సూర్యనారాయణ అడ్వకేట్సు, వరదా బ్రహ్మనందం, వానపల్లి, జి. భాస్కరరావు, నూకాచారి, రేలంగి ఉదయ భాస్కర్, బషీర్, కె.వి.వి.రమణ, గోవిందరావు, కాకరాల బ్రదర్స్, జమ్మ సత్యనారాయణ, జానకినాధ్, సిహెచ్. యోన, డి. శ్రీరామం, వై.వి. సుబ్రహ్మణ్యం, యర్రాప్రగడ రామకృష్ణ, రాధ మొదలయినవారెందరో ఉన్నారు.

పౌరాణిక నాటకాల్లో దర్వేష, గుడిమెట్ల గంగరాజు (హార్మోనిస్టు) పెంజర్ల ట్రూపు ప్రధానంగా చెప్పాలి. నటులుగా దర్వేష, పెంజర్ల, నరేంద్ర కమార్, ద్వారా రామారావు, యన్ డి. లక్ష్మి, సి.హెచ్. లలితా కుమారి, నెల్లూరు నాగమణి వై.యస్.లక్ష్మి, బేతా సుశీల, రాధ, రమాదేవి(రామాయమ్మ) యిత్యాదులెందరో ఉన్నారు

రాజమండ్రిలో శ్రీ రామ నవమి ఉత్సవాల్లో వాటర్ వర్క్స్ రామాలయం వద్ద, గొల్లల గుడి వెలమలగుడి, పడవలరేవు, కొత్తపేట రామాలయం వద్ద, ఉల్లితోటవీధి మొదలయిన ప్రదేశాలలో నాటక ప్రదర్శనాలు స్థానికులే ప్రదర్శించేవారు. అలానే ఆశపువారి వీధిలో శ్రీ ఆశపు నాగరాజాగారి

పర్యవేక్షణలో గణపతి నవరాత్రులు స్థానికులే ప్రదర్శన లిచ్చేవారు. అలానే యీ మధ్య కాలంలో దేవిచైక్‌లో శ్రీ బత్తుల మల్లిఖార్జునరావుగారితో ప్రారంభించబడి నేటి రాష్ట్రంలోని ప్రముఖ నటులతో నాటక ప్రదర్శనాలిస్తున్న సంస్థ శ్రీ నందం సీతారామారాజు (ఆర్యాపురం కొపరేటివ్ అర్బన్ బ్యాంక్) అధ్యక్షులు వారి తండ్రి స్మారకంగా వెలసిన 'గనిరాజు సెంటర్‌లో కృష్ణాష్టమికి ఉత్తమ నాటక ప్రదర్శనలు, శ్యామలానగర్, వినాయక గుడి సెంటర్‌లో గణపతి నవరాత్రులు - మంగళవారపు పేటలో గణపతి నవరాత్రులు - నేటికీ నాటక కళకు ఇతోధికమైన సేవలందిస్తూ ఉన్నాయి.

రాజమండ్రి ప్రభుత్వ ఆర్ట్సు కాలేజి. మునిసిపల్ హైస్కూలు, టౌన్ మిడిల్ స్కూలు, సిటీ మిడిల్ స్కూలు, వీరేశలింగం హైస్కూలు - నాటక కళకు ఎంతో సేవచేసి, విద్యార్థులను కళాకారులుగా తీర్చిదిద్దాయి.

ఆంధ్రప్రదేశ్ వృత్తి కళాకారుల సమాఖ్య కూడా రాజమండ్రిలో పలు కార్యక్రమాలు చేబట్టింది కే శే. దుర్గా వెంకట రమణరావు, శ్రీ గంధం రామారావు, శ్రీ పి.బి. వీరాచార్యులు, కీ.శే. జైహింద్ రమణ శ్రీ ప్రసాదుల గురుమూర్తి దీని సారధులు కళాకారులకు 25 ఇండ్ల స్థలాల పంపిణీ చేయించారు. ఈ సందర్భంలో మాజీ మునిసిపల్ కమీషనరు, డిప్యూటీ డైరెక్టర్ మునిసిపల్ అడ్మినిస్ట్రేషన్‌గా పదవీ విరమణ చేసిన శ్రీ ఎ. సుబ్బారావు గారు చేసిన సేవలను గుర్తించికోవాలి శ్రీ వెంకటేశ్వర ఆనం కళా కేంద్రం నిర్మాణంలో వారి కృషి, పట్టుదల ఎంతైనా వుంది అలానే వృత్తి కళాకారులకు స్థలాల పంపిణీలో కూడా వారి కృషే ముఖ్యం.

నాడునేడు నాటక కళోద్ధరణకు ఉదారులయిన పురప్రముఖుల అండదండలు, ప్రోత్సాహం ఎంతో ఉంది. వారిలో పేర్కొనవలసిన ప్రముఖులు శ్రీయుతులు దేవత రామమోహనరావు, బచ్చు సత్యానందం, కొత్త రాంబాబు, ఎ.సి.వై రెడ్డి, నెక్కంటి సత్యనారాయణ (ప్రొడ్యూసర్) డాక్టరు కె.వి శరియన్, పోతుల వీరభద్రరావు, కోగంటి సోదరులు. రవణం శ్రీరాములు, గంధం సీతారామాంజనేయ, నార్ని కేదారీశ్వరుడు, దుర్గా వెంకటరమణరావు, చల్లా

అప్పారావు మునిసిపల్ ఇన్‌ఛార్జి ఛైర్మన్ కెప్టెన్ కె.యల్. యన్ రావు (డెంటిస్టు) తుమ్మిడి రాంకుమార్, చందన కేదారీష్, మేడపాటి సీతారామరెడ్డి.

రాజమండ్రిలో ప్రముఖంగా పేర్కొనదగ్గ నాటక ప్రదర్శనశాలలో శ్రీ వెంకటేశ్వర ఆనంకళా కేంద్రం పేర్కొనాలి. ఆంధ్ర ప్రదేశ్‌లోనే ఉత్తమ ప్రదర్శనశాలల్లో ఇదొకటి. శ్రీ ఆనం వెంకటరెడ్డి గారి వితరణతో తిరుమల-తిరుపతి దేవస్థానం, పురప్రముఖుల విరాళాలతోను నిర్మింపబడింది. శ్రీ ఆనం వెంకటరెడ్డి ఔత్సాహిక నాటకసమాజాలకు ఎంతో ప్రోత్సాహమిస్తున్నారు ఇంకా నవభారత్ గురుకులం (శ్రీ సత్యసాయి గురుకులం) ఆంధ్రా పేపరు మిల్లు, టౌనుహాలు, కందుకూరి రాజ్యలక్ష్మి కళాశాల, గవర్నమెంటు ఆర్ట్సు కళాశాల ఆవరణలలోను, అప్సరా ఆడిటోరియం - ప్రదర్శనశాలలు నిర్మించారు.

చిట్టచివరిగా ఒక్కమాట నాటక ప్రచురణ కర్తల గురించి చెప్పక పోతే నాటకరంగ చరిత్ర పూర్తి కాదు ప్రచురణ కర్తల్లో ముఖ్యంగా పేర్కొనవలసింది. శ్రీ కొండపల్లి వీర వెంకయ్యగారు - వారు నాటక కళకు ఎంతో సేవ చేసారు. సుమారు. 200 పౌరాణిక, సాంఘిక నాటకాలు ప్రచురించారు. చిలకమర్తి, పానుగంటి, భమిడిపాటి (తండ్రి కొడుకుల) నాటకాలు - గురుజాడవారి కన్యాశుల్కం లాంటి ఆనాటి ప్రముఖుల నాటకాలు ప్రచురించిన - నాటక ప్రచురణ కర్తలలో ఆద్యులు వారు. శ్రీ అద్దేపల్లి, కాళహస్తి, గొల్లపూడి వారు కూడా అనేక నాటకాలు ప్రచురించి ఎంతో సేవ చేసారు.

పతివాడ సూర్యనారాయణ
రిటైర్డు డిప్యూటీ కమీషనర్
కమర్షియల్ టాక్సెస్
రాధిక బిల్డింగ్, ప్రకాష్‌నగర్
రాజమండ్రి.

# అమరథామంలా శోభిల్లే రాజమహేంద్రి

-పురాణపండ శ్రీనివాస్

శతాబ్దాల నాగరికతకు సాక్షీభూతంగా భాసిల్లే పవిత్ర గౌతమీతీరాన దక్షిణ కాశీక్షేత్ర పవిత్రతను సంతరించుకున్న నగరి రాజమహేంద్రి.

రాజకులైక భూషణుడు, చాళుక్యకీర్తి వర్ధనుడు రాజరాజ నరేంద్రునిచే పరిపాలించబడ్డ నగరం. రాజమహేంద్రవరం.

సహస్ర సంవత్సరాల మార్గకవిత్వ చరిత్రను కలిగి వెలుగుతున్న పురం.. రాణ్మహేంద్రపురం.

సజీవాంధ్రభాషలో భారతదేశ సంస్కృతీ భాసురంగా ఆంధ్ర మహాభారతాన్ని ఛందోబద్ధ కవిత్వంలో అందించిన తొలి తెలుగు కవి నన్నయ. ., దక్షిణ భారతదేశంలోనే సంఘ సంస్కర్తగా పేరొందిన విప్లవరంగ కిశోరం వీరేశలింగం..., నవ్వుల పువ్వులు రువ్వుతూ వచన రచనలతో హాస్యపు వెలుగులు విరజిమ్మిన హాస్యబ్రహ్మ భమిడిపాటి కామేశ్వరరావు.., వీరేశలింగ మార్గంలో విశేషంగా ప్రయాణిస్తూ 'గయోపాఖ్యాన' నాటకంతో యావదాంధ్ర సామాన్య జనహృదయాలను ఉర్రూతలూపిన ప్రతిభామూర్తి చిలకమర్తి.., గుండుకు గుండె చూపి బ్రిటిష్ గుండెల్ని గడగడ లాండిచి రాజమహేంద్రి పురపాలక సంఘ అధ్యక్షపదవి నధిరోహించిన ఆంధ్రకేసరి ప్రకాశం..., కథారచనా రంగంలో నూటికి నూరుపాళ్ళు తెలుగుదనాన్ని వ్యక్తీకరించిన శక్తివంత కథారచయిత గోదావరీ తీరపు తెలుగు తీపిని చవిచూపించడానికి తన కథాద్వారాలను తెరచిన కథక చక్రవర్తి శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రి.., తన అఖండ ప్రతిభా పాటవాల ప్రదర్శన ద్వారా ఆంధ్ర నాటకరంగాన్ని జనం మధ్యలోకి తీసుకువచ్చిన యాక్టర్ ప్లస్ డైరక్టర్ గరికిపాటి రాజారావు.., తెలుగునేల నాల్గు చెరగులా తిరిగి జానపదాల్ని సేకరించి మూటకట్టి 'సిసలైన తెలుగు సంపద ఇదే' అంటూ ఆంధ్ర జాతికి సగర్వంగా, గర్వరహితంగా అందించిన జానపద-వాఙ్మయోద్ధారక నేదునూరి

గంగాధరం.., సొగసులలో ముంచిన తన కుంచెతో చిత్రకళా ఖండాలను సృష్టించి ఖండాంతర ఖ్యాతి గాంచిన దామెర్ల రామారావు ., అంతర్జాతీయ ఖ్యాతి గాంచిన 'దిహిందూ' ఆంగ్ల దినపత్రిక సంస్థాపకులలో ఒకరైన 'ఆంధ్రభీష్మ' న్యాపతి సుబ్బారావు పంతులు. ., స్వాతంత్ర్య సమరయోధులలో రచనా దురంధురునిగా, కథారచయితగా, 'వేదిక' పత్రిక సంపాదకునిగా, విశేషించి 'అమ్మ' (మాగ్జిమ్ గోర్కీ) నవలను తెలుగులోకి అనువదించిన మేధావి క్రొవ్విడి లింగరాజు. , రాజమహేంద్రి లాల్‌బహదూర్‌శాస్త్రిగా పేరొంది, నిస్వార్థ రాజకీయ జీవితానికి నిర్మల-దర్పణంగా నిలచిన డాక్టర్ ఎ.బి.నాగేశ్వర రావు.. , అసమాన సౌజన్య హృదయంతో, అచంచల దీక్షతో రాజమహేంద్రి కేంద్రంగా 'సమాచారమ్' పత్రికకు రాష్ట్ర వ్యాప్తకీర్తిని ఆర్జించిపెట్టిన గంధం సీతారామాంజనేయులు. , ఇత్యాది మహనీయుల, మానధనుల జీవితాల విశేషఘట్టాలతో పునీతమైంది..రాజమహేంద్రి.

సువర్ణాక్షరాలతో చరిత్రలో కెక్కిన రాజమహేంద్రి పుటల్ని విప్పితే వ్యక్తులేకాక అనేక సంస్థలు కూడా దర్శనమవుతాయి. అవేమంటే సుమారుగా శతాబ్దచరిత్రకు చేరుకున్న ప్రాచీన గౌతమీ గ్రంధాలయం ., సౌందర్య రసమయలోకాలను తన చిత్రకళావైదుష్యం ద్వారా దర్శింపచేసిన రమణీయ చిత్రాల సృష్టికర్త దామెర్ల రామారావు స్మారక చిత్రకళా మందిరం.., శాసనాల, నాణాల, శిల్పాల వంటి వస్తుసంపదతో కనబడని చరిత్రను కన్పింపచేసే రాళ్ళబండి సుబ్బారావు స్మారక ప్రభుత్వ పురావస్తుశాల.., జనశృతుల కథలలో విలసిల్లే సారంగధర చరిత్రకు స్మృతి శకలంగా నిలచిన సారంగధర మెట్ట., వందల కార్మికులకు జీవనాధారంగా నిలచి, రాణ్మహేంద్రి పురోభివృద్ధికి పారిశ్రామిక ప్రగతి చిహ్నంగా మిరమిట్లు గొలుపుతున్న ఆంధ్రప్రదేశ్ పేపర్ మిల్స్ లిమిటెడ్.., పొగాకుల్ని కోట్ల నోట్లుగామార్చి ప్రభుత్వం దోసిలిలో గుమ్మరిస్తున్న కేంద్ర పొగాకు పరిశోధనా సంస్థ.., యావద్భారతానికీ 'ఆయిల్స్'ను పంపిణీ చేసే నిమిత్తం భూగర్భంలోంచి 'చమురు'ను వెలికి తీసేందుకు వివిధరీతుల్లో అన్వేషణోద్యమాన్ని సాగిస్తున్న సహజ వాయు

చమురు సంక్షేమ సంస్థ...., కరువు రాక్షసి కరాళనృత్యానికి అడ్డుకట్టగా ఆనకట్టను కట్టిన అపర భగీరధుడు సర్ ఆర్ధర్ కాటన్ స్మృతి వెలుగు కాటన్ ఆనకట్ట.., శత వసంతాల చరిత్రతో విరాజిల్లుతున్న ఆంధ్రదేశంలోని ప్రప్రధమ పురమందిరం వీరేశలింగం టౌన్‌హాల్.., శ్రీనాధ కవీంద్ర సందర్శిత దేవాలయం వేణుగోపాల స్వామి దేవాలయం. , 'వందేమాతరం' ఉద్యమ భాగస్వామి వెన్నేటి సత్యనారాయణ జ్ఞాపకంగా మిగిలిన విక్రమహాలు.., గౌతమీ ఆశ్రమ నిర్మాత, త్యాగధనుడు బ్రహ్మజోస్యుల సుబ్రమణ్యం విశాల హృదయాన్ని తలపింపచేసే వివిధ సభల కూడలి సుబ్రమణ్య మైదానం ., నేరస్థుల సంస్కరణాలయంగా నూటపాతికేళ్ళను నింపుకున్న కేంద్రకారా గారం..., వర్తమాన కాలపు రాణ్మహేంద్రి తెలుగు వెలుగు తెలుగు విశ్వవిద్యాలయం.., ఇత్యాది సమస్త సంస్థల్ని మణిహారంగా ధరించి ధగద్ధగాయమాన కాంతులీనుతోంది రాజమహేంద్రి.

పుష్కరార్ద్ర గౌతమీ తీరాన విలసిల్లుతున్న రాజమహేంద్రి..అటు చారిత్రకరంగంలో గణనీయంగాను, ఇటు సాహిత్యరంగంలో మార్గదర్శకంగాను భాసిల్లుతూ ప్రవాహ సదృశ్య చరిత్రను నూతన రంగాలలోకి మళ్ళించుకుంటూ వివిధ రంగాలలో తన కీర్తిని సుసంపన్నంగా సుస్థిరం చేసుకున్న దనడంలో వేరే సంశయాలనవసరం.

## పురాతన గౌతమీ తీరంలోని అధునాతన విజ్ఞాన తీర్థం

# రాజమండ్రి ప్రభుత్వ కళాశాల

135 సంవత్సరాల ఉజ్వల చరిత్ర ఉన్న ఈ కళాశాల ప్రస్తుతం 50 ఎకరాల విస్తీర్ణంగల సుక్షేత్రంలో రెండు ఆధునిక భవనాలతో నయనోత్సవం చేస్తోంది. 1960లో శతజయంతి మహావైభవోపేతంగా జరుపుకున్న ఈ కళాశాల ప్రాంగణంలో ఈనాడు అడుగు పెట్టగానే 'శతజయంతి కీర్తిస్తంభం' ముందుగా మనకు సాక్షాత్కరిస్తుంది ఆ స్తంభంమీద 'వీణాపాణి సరస్వతి' ప్రసన్నంగా దర్శనమిస్తుంది. విశాల తరుచ్ఛాయలుగల ఆ శృంగాటకంలో నిలబడితే, కుడివైపు ఆధునిక విజ్ఞానశాస్త్రాల బోధనకోసం కట్టిన E ఆకారంగల రెండంతస్తుల పెద్దమేడ, ఎడమవైపు H ఆకారంలో కట్టిన రెండంతస్తుల మరో పెద్దమేడ మనల్ని ఆహ్వానిస్తాయి. దాదాపు 100 గదులున్న ఈ భవానాల్లో 1800మంది యువకులు ఇరవై రకాల ఆధునిక విజ్ఞాన శాఖల్ని నిత్యం అధ్యయనం చేస్తూ ఉంటారు. ఆయా శాఖల్లో నిష్ణాతులైన 170 మంది అధ్యాపకులతో ఈ కళాశాల ఒక చిన్న విశ్వవిద్యాలయం అనడం అత్యుక్తి కాదు. 4 శాఖల్లో పి.జి.కోర్సులూ 60వేల అపురూప గ్రంథాలున్న గ్రంథాలయమూ 2 అతివిస్తృత క్రీడారంగాలూ సార్వత్రిక విశ్వవిద్యాలయ కేంద్రమూ ఆంధ్ర విశ్వవిద్యాలయ కరస్పాండెన్సు కోర్సు అద్యయన కేంద్రమూ మెట్కాఫ్ స్మారక విద్యార్థి వసతి నిలయమూ ఇలా ఎన్నెన్నో విశేషాలు మనల్ని ఆకర్షించి ఆశ్చర్యపరుస్తాయి.

ఈ నూతన భవనాలు అవతరించకముందు 1855నుంచి 1953 వరకూ ఈ కళాశాల కింకా గొప్ప చరిత్ర ఉంది. అప్పుడది గోదావరీతీరంలో (ఇన్నీసుపేట) ఉత్తర సర్కారు జిల్లాల ఏకైక ప్రథమశ్రేణి కాలేజీగా పేరుపొందింది. మొదటి 50 సంవత్సరాలూ ఈ కళాశాల చరిత్రలో స్వర్ణయుగంగా చెబుతారు. ఆ అర్ధశతాబ్దిలో ప్రిన్సిపాలు పదవుల్లో ఉన్నవారంతా యూరోపునుంచి వచ్చిన మహామనీషులు; విజ్ఞాన స్వరూపులూను. వారిలో మెట్కాఫ్, మార్కుహంటర్, కూర్డ్రే అనే ముగ్గురినీ 'గురుత్రయం'గా భావించాలి. వారు కేవలం పరిపాలకులు కారు, వ్యక్తిత్వాలను సానపట్టి నగిషీలు తీర్చే విజ్ఞానశిల్పులుగా కూడా తమ పాత్రలు నిర్వహించారు.

యుగకర్త వీరేశలింగం తొలి ఉద్యోగం (1871) ఈ కళాశాలలోనే! కొక్కొండ వెంకటరత్నం, ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రి, వద్దాది సుబ్బారాయకవి, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, వంటి సాహిత్యవేత్తలే కాకుండా సర్వేపల్లి రాధాకృష్ణన్ వంటి తత్త్వవేత్తలు కూడా ఈ కళాశాలలో పాఠాలు చెప్పినవారే. విజ్ఞాన శాస్త్రాలనూ ఆంగ్లసాహిత్యాన్నీ బోధించిన వారిని పేర్కొనాలంటే చోటు చాలదు. ఇలాంటి జ్ఞాన క్షేత్రంలోనే పుట్టుకొచ్చారు టంగుటూరి ప్రకాశం, కోకా సుబ్బారావు, దామెర్ల రామారావు, అడవి బాపిరాజు, కవికొండల వెంకటరావు, భమిడిపాటి కామేశ్వరరావు, వంటి ఆంధ్రపుత్రులు, విజ్ఞాన మిత్రులు!

సత్యం, జ్ఞానం, ప్రేమ, ధర్మం, దయ వంటి ఉదాత్త గుణాల్ని విద్యార్థుల్లో పాదుకొల్పి పూలు పూయించే సాధన ఎంతో జరిగింది ఈ కళాశాల చరిత్ర దృశ్యాల్లో ఇరవయ్యోశతాబ్దిలోకి ఆంధ్రదేశాన్ని ప్రవేశ పెట్టడంలో ఈ కళాశాల ముఖద్వారమయిందని చరిత్ర రుజావు చేస్తోంది

ఇటీవలి కాలంలో కూడా విస్సా అప్పారావు గారినుంచి ఆర్.ఎస్ సుదర్శనం గారి దాకా (1925-81) పరిపాలనలో దక్షులయిన వారే కాకుండా రచయితలు, కవులు, పరిశోధకులు, పండితులు ప్రిన్సిపాలుగిరీ నధివసించడం కనిపిస్తుంది. ముఖ్యంగా శ్రీ పాద గోపాల కృష్ణమూర్తి, భూపతి లక్ష్మీనారాయణరావు, సంపత్ రాఘవాచార్య వంటివారు సాహిత్యరంగంలో స్మరణీయులు.

తెలుగు శాఖకు చెందిన కె.రాజమన్నారు ప్రిన్సిపాలుగా ఉండగా ఈ కళాశాల శతజయంతి (1960) బ్రహ్మాండంగా జరిగింది. డా॥సి.డి.దేశ్ముఖ్ ఆ ప్రారంభోత్సవానికి రావడం విశేషం.

మార్కుహంటర్ గారి హయాం(1903-19)లోనే ఈ కళాశాలలో పి.జి.కోర్సులు జరిగాయి. అప్పటికింకా ఆంధ్ర విశ్వవిద్యాలయం అవతరించనే లేదు కనుక మన ఆంధ్రదేశపు తొలి విశ్వవిద్యాలయం ఈ కళాలయమే అనడానికి వెనుకాడనక్కర్లేదు.

కళాశాలాధ్యక్ష వంశ పారంపర్యంలో ఇప్పుడు 54వ ప్రిన్సిపాలుగా శ్రీ ఎస్.వి. రాఘవేంద్రరావు బాధ్యతలు స్వీకరించి కళాశాలను ప్రగతిమార్గంలోకి నడిపించడం ముదావహం.

# దర్శనీయ స్థలాలు

## ట్రయినింగు కాలేజి

## ప్రభుత్వ సమగ్ర విద్యాబోధన కళాశాల

రాజమహేంద్రవరంలోని దర్శనీయ విద్యాసంస్థలలో మరొకటి ప్రభుత్వ సమగ్ర విద్యాబోధన కళాశాల. ఈ కళాశాలకు అనుబంధంగా ఆదర్శ పాఠశాల కూడా ఉంది.

ఈ మహత్తర విద్యాసంస్థ 1883లో ఉదయించింది. అంటే ఎంత ప్రాచీనమయిందో ఊహించుకోవచ్చు. 1983లో జరగవలసిన శతవార్షికోత్సవాలు 1987 ఏప్రిల్ 7వతేదీన అత్యంత వైభవంగా జరిగాయి–ఆలస్యంగానే అయినా.

ఆ వార్షికోత్సవాలకు ఆనాటి మన భారత రాష్ట్రపతి మాన్య మహోదయులు శ్రీ జ్ఞాని జయిల్‌సింగ్ హాజరవడం చరిత్రకు గర్వకారణం సెంటినరీ స్థూపాన్ని ఆయన ఆవిష్కరించారు.

ఈ కళాశాలకు మొదటిదశలో ట్రయినింగు కాలేజి అని పేరు ఉండేది. ఉత్తర సర్కారు జిల్లాల్లో ఇదే మొదటి బోధనాభ్యసన విద్యాపీఠం. మెట్‌కాఫ్, థాంప్సన్, రోస్, జయంతి సత్యనారాయణమూర్తి, కేశిరాజు సత్యనారాయణ, విస్సా అప్పారావు వంటి మహామహులు ఈ కళాశాల అధ్యక్షపీఠాలను అలంకరించి, పిల్లలకు పాఠాలు చెప్పవలసిన తీరుతెన్నులకు ఒరవడి దిద్దారు.

స్వాతంత్ర్య సమరయోధులైన శ్రీ దుగ్గిరాల గోపాల కృష్ణయ్య సాహిత్య వేత్తలయిన వడ్డాది సుబ్బారాయ కవి వంటి వారు ఈ కళాశాలలో పాఠాలు చెప్పారు.

ఈ కళాశాల పుట్టుపూర్వోత్తరాలు పరిశీలిస్తే 1894లో మొట్టమొదటగా ఎల్.టి. తరగతులు ప్రారంభమయ్యాయని తెలుస్తుంది. అప్పటినుంచే దీన్ని ట్రయినింగు కాలేజి అనేవారు. అంతకుముందు ప్రాథమిక విద్యాశాలగానూ

మాధ్యమిక విద్యాశాలగానూ రూపాలు మార్చుకుంటూ వచ్చింది.

1894నుంచీ ఈ కళాశాలా, ఇప్పటి ప్రభుత్వ కళాశాలా కలిసిమెలిసి ఉంటూ ఉండేవి. కానీ 1900లో ఈ కళాశాల ప్రభుత్వ కళాశాలనుంచి విడిపోయింది. 1917నుంచి ఈ కళాశాల అభివృద్ధి ఆరంభమయింది.

కాలం మారుతున్న కొద్దీ విధానాలలో మార్పు రావడం సహజమే! ఆనాటి ఎల్.టి.కోర్సు బి.ఇడి. కోర్సుగా మారింది.

ఈ కళాశాలలో 1948లో వచ్చిన కొత్తకోర్సు తెలుగు పండితుల బోధనాభ్యసన విధానం. దాన్ని "తెలుగు పండిట్స్ ట్రయినింగు కోర్సు" అంటారు. ఇది కొనసాగుతోంది. ఈ కోర్సును సమర్థవంతంగా నిర్వహించిన ఆచార్య శ్రీ గొడవర్తిసూర్యనారాయణగారు 'అభినవాచార్యకం' రచించి, తెలుగు భాషా బోధకులకు మార్గదర్శకులయ్యారు.

1954లో ఈ కళాశాల ఇంకా ఎదిగింది. ఆ ఎదుగుదలకు సూచిక ఎం.ఇడి. కోర్సులు.

1972లో ఈ కళాశాలకు నూతన రూపాన్ని విద్యావేత్తలు కల్పించారు. అప్పటినుంచీ ఇది "సమగ్ర విద్యా బోధన కళాశాల" అని పేరు మార్చుకుంది.

ఆంధ్ర విశ్వవిద్యాలయాని కనుబంధంగా ఉన్న కళాశాలల్లో ఇదీ ఒకటి.

ఈ కళాశాలలో అనుబంధంగా ఉన్న "ఆదర్శ పాఠశాల" (మోడలుస్కూలు) తెలుగు నాట ఎందరెందరు విద్యార్థులనో ఉత్తేజపరిచి, ఉద్దీప్తంచేసి, పెద్ద బుద్ధిమంతులుగా విద్యావేత్తలుగా ఎదిగేందుకు దోహదం చేసింది. "అచట బుట్టిన చిగురు గొమ్మయిన చేవ"!

1987నుంచి బి.ఇడి. విద్యార్థుల సంఖ్య 160కి పెరిగింది. ఐదునెలల కాలపరిమితిగల తెలుగు పండిత విభాగంలో సంవత్సరానికి 150 మంది పండితులు బోధనకళ నభ్యసిస్తున్నారు.

జ్ఞానాన్ని ఆర్జించడం ఒక శ్రమ. కానీ జ్ఞానాన్ని బోధించడం ఒక కళ. ఆ కళను నేర్పుతుంది ఈ కళాశాల అద్వితీయ పద్ధతిలో.

# శ్రీ గౌతమీ విద్యాపీఠం

## కాండ్రేగుల జగన్నాధరావు ఓరియంటల్ డిగ్రీకళాశాల

ఈ సంస్కృత కళాశాల 1957లో శ్రీ గౌతమీ విద్యాపీఠము వారిచే స్థాపింపబడినది. స్థానిక జమీందారులైన శ్రీ కాండ్రేగుల వారి కుటుంబం ఈ విద్యాపీఠ భవనముల కొరకు సీతంపేటలో స్థలము, విద్యార్థుల వసతి కొరకు భవన నిర్మాణమునకు పక్కాభవనమునకు భూరి విరాళమొసంగినారు. వీరి నిస్వార్థ సేవకు స్మృతి చిహ్నముగా ఈ కళాశాలకు శ్రీ కాండ్రేగుల జగన్నాధరావు గారి పేరును చేర్చి శ్రీ గౌతమీ విద్యాపీఠం కాండ్రేగుల జగన్నాధరావు సంస్కృత కళాశాలగా వ్యవహరింపబడుచున్నది. ఈ కళాశాల సంస్కృత విద్యకు ఆంధ్రాయూనివర్సిటి ఇంటిగ్రేటెడ్ డిగ్రీకోర్సులకు తరగతులు నిర్వహించుచున్నది. ఈ కళాశాలధ్యక్షులుగా పనిచేసి విశ్రాంతి పొందిన శాస్త్రరత్నాకర, ఆమ్నాయమీమాంసా భాస్కర, వేదార్థసమ్రాట్ బ్రహ్మశ్రీ రేమెళ్ల సూర్యప్రకాశ శాస్త్రిగారు (2) వ్యాకరణరత్న, దర్శనాచార్య బ్రహ్మశ్రీ పేరి సూర్యనారాయణ శాస్త్రిగారు, (3) తర్క వ్యాకరణ పండితులు బ్రహ్మశ్రీ గోడా సుబ్రహ్మణ్య శాస్త్రిగారు (4) బ్రహ్మశ్రీ చివుకల సుబ్బరామయ్యగారు ప్రతిష్ఠాకరమైన గౌరవనీయులైన భారతదేశాధ్యక్షులచే సన్మానముల నందియున్నారు.

ఈకళాశాల బ్రహ్మశ్రీ విశ్వనాధ గోపాలకృష్ణ గారి పర్యవేక్షణలో సంస్కృత భాషకు గణనీయమైన సేవ చేయుచున్నది.

# శ్రీ కందుకూరి వీరేశలింగము విద్యాసంస్థలు

సుప్రసిద్ధ సంఘ సంస్కరణోద్యమ కర్తలైన రావుబహద్దూర్ శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు బ్రహ్మసమాజ స్థాపకులైన రాజారామ్మోహన్‌రాయ్ ప్రభావముచే ప్రజలలో సంస్కరణను తీసుకొని వచ్చుటకు ఉత్తమ సాధనము విద్యయని విశ్వసించిరి. ఈ సంఘ సంస్కరణ పరమలక్ష్యముతో జాతీయ పాఠశాలలను స్థాపింప సంకల్పించిరి. సుప్రసిద్ధ కవులు శ్రీ వీరేశలింగము పంతులు గారి శిష్యులైన శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహం పంతులుగారు రాజమహేంద్రవర పట్టణములో ఒక మాధ్యమిక పాఠశాలను (Hindu Vernacular middle school) నడుపుచుండిరి. శ్రీ పంతులుగారు ఆ పాఠశాలను హితకారిణీ సమాజమునకు ఇమ్మని కోరగా దానికి వారంగీకరించిరి. అది 16.9.1907 లో ఒక పాఠశాలగా స్వీకరించిరి. ఆ పాఠశాలయే 19.1.1909 లో వీరేశలింగం ఉన్నత పాఠశాలగా రూపొందినది. ఈ పాఠశాల భవన నిర్మాణము కొరకు పిఠాపురము మహారాజా సూర్యారావు బహద్దూర్ గారు 75,000 రూపాయలు దానము చేసిరి. ఆ పాఠశాల 1911 నవంబరు 27న సుప్రసిద్ధ బ్రహ్మసమాజ మతానుయాయి కలకత్తానగర సిటి కాలేజి అధ్యక్షులు అయిన హేరంబ చంద్ర మైత్రగారు పాఠశాల గృహ ప్రవేశ మహోత్సవము చేసిరి.

**రాజ్యలక్ష్మి మహిళా కళాశాల :**

శ్రీ వీరేశలింగము పంతులుగారి ఆశయములకు అనుగుణముగా 1968 లో 29 మంది విద్యార్థినులతో కుమారి కె.రుక్మిణీ దేవి అధ్యక్షురాలుగా రాజ్యలక్ష్మి కళాశాల స్థాపింపబడినది.

ఆ కళాశాల నేడు మూడు వేలమంది విద్యార్థినులతో శతాధిక మైన ఉపాధ్యాయినులతో శ్రీమతి టి.బుచ్చిసుందరి గారి పర్యవేక్షణలో ఆంధ్రదేశములోని ప్రథమ శ్రేణి మహిళా కళాశాలలో పేరెన్నిక పొందుట ముదావహము. అది వీరేశలింగము పంతులు గారి ఆనందవనమునకు ఎదురుగా

దివ్యభవనములతో సుందరోద్యానములతో విలసిల్లుట ప్రశంసార్హము.

1970లో శ్రీ వీరేశలింగము జూనియర్ కళాశాల, 1972లో డిగ్రీకళాశాల, 1974లో ఇంగ్లీషు మీడియం ఉన్నత పాఠశాలలు ప్రారంభింపబడి రాజమండ్రిలో విద్యావసరములను తీర్చుట ప్రశంసింపదగినది.

శ్రీ వీరేశలింగము విద్యాసంస్థలు త్రివిక్రమాభ్యుదయము పొందుటకు సర్వశ్రీ బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు, డాక్టర్. వేమూరి రామకృష్ణారావుగారు, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, ప్రధానోపాధ్యాయులు శ్రీ జయంతి గంగన్న పంతులుగారు చేసిన కృషియే కారణమని చెప్పనగును. ఎందరో మహానుభావులు ఈ మహాకార్యక్రమమునకు చేయూత నొసగిరి

## ఇతర విద్యాసంస్థలు

## (ఆంధ్రయువతీ సంస్కృత పాఠశాల – వైశ్యసేవా సదనము)

కాకినాడ వాస్తవ్యులు శ్రీనాళం రామలింగయ్య, వీరి సోదరులు సత్యానందము గారలు తమ తల్లి సుభద్రమ్మ గారి జ్ఞాపకార్థమై శ్రీ బత్తుల కామాక్షమ్మగారి ప్రోత్సాహముతో వైశ్యస్త్రీలకై సుభద్రానిలయమని 1920లో ఒక పాఠశాల స్థాపించిరి. అదియే ఆంధ్రయువతీ సంస్కృత పాఠశాలగా పేరు పొందినది. 1931లో ఎలిమెంటరీ స్కూలు సంస్కృతోన్నత పాఠశాలగా తరువాత కళాశాలగా ప్రభుత్వానుమతి పొందినది. శ్రీమతి బత్తుల కామాక్షమ్మ, శ్రీ ఎరసూరి మల్లికార్జునరావు, శ్రీ యస్.టి.పి.యు.కోనప్పాచార్యులు, శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మ అధ్యక్షులుగా వ్యవహరించిరి. ప్రస్తుతము కళాశాలకు శ్రీ ప్రభాకర శ్రీ కృష్ణ భగవానులుగారు అధ్యక్షులు, శ్రీమతి కొప్పర్తి యశోదాకుమారి గారు ఉన్నత పాఠశాలకు ప్రధానోపాధ్యాయినిగా ఉన్నారు. గోదావరి తీరమున ఉన్న ఈ సంస్కృత కళాశాల స్త్రీల విద్య కొరకు, సాహిత్య కార్యక్రమములను నిర్వహించుటలో ప్రముఖ పాత్ర వహించుట ముదావహము.

## నవభారతీ గురుకులము :

శ్రీ తన్నీరు బుల్లెయ్య గారు 1940లో వీరభద్ర పురములో ముగ్గురు విద్యార్థులతో, నలుగురు ఉపాధ్యాయులతో శాంతి నికేతన్ పద్ధతిలో ఒక పాఠశాల స్థాపించిరి. తరువాత 1952లో భగవాన్ పుట్టపర్తి సాయిబాబగారి ఆశీస్సులతో అధునాతన సత్సంప్రదాయాల మేలికలయికతో ఆల్కాటు తోటలో రైలుకట్ట ప్రక్క మాధ్యమిక పాఠశాల స్థాపింపబడినది. విద్యార్థులలో ఆస్థిక బుద్ధి, పరోపకార పారీణత, సత్యసంధత, దేశభక్తి, వినయవిధేయతలు కల ఆదర్శ పౌరులుగా విద్యార్థులను తీర్చిదిద్దుటయే ఈ గురుకుల ఆశయము. శ్రీ బుల్లెయ్యగారు తమ సర్వస్వము ఈ విద్యాసంస్థకు త్యాగము చేయుట ప్రశంసింపదగినది. నవభారతీ గురుకులము రాజమండ్రికి ఒక అలంకారమని చెప్పవచ్చు.

## హెూమియోపతీ కళాశాల :

శ్రీ బోడా వెంకటరత్నం, శ్రీ చింతలూరి జానకిరామయ్య అధ్యక్ష కార్యదర్శిత్వంలో ప్రిన్సిపాల్ కాశీ ప్రసాదరావుగారి కృషి వలన 1969లో హెూమియోపతీ కళాశాల శ్యామలాంబరోడ్డులో ఆవిర్భవించినది. తరువాత ప్రభుత్వానుమతి లభించి MBBS వలెనే DM.HS డిగ్రి ఇచ్చు హెూమియోపతీ కళాశాల ప్రభుత్వ కళాశాల ఆవరణలో సొంత భవనములతో నిర్వహింప బడుచున్నది. ఈ కళాశాలకు ప్రసిద్ధనటుడు శ్రీ అల్లు రామలింగయ్యగారు రూ.50,000ల ఉదార విరాళము ఇచ్చినారు.

## ఆంధ్రకేసరి సెంటినరి జూనియర్ కాలేజి :

ఆంధ్ర కేసరి యువజన సమితి 1972లో ఆంధ్రకేసరి సెంటినరి జూనియర్ కళాశాల స్థాపించిరి. ఇది ఇంటర్మీడియట్ స్థాయి విద్యాబోధన చేయుచున్నది. ఇది రాజమండ్రి ఆనాల వెంకటప్పారావు రోడ్డులో చక్కని భవనములతో నిర్వహింపబడుచున్నది. కళాశాల కేవలం విద్యాబోధనే కాకుండా

అనేక సాంస్కృతిక కార్యక్రమములను నిర్వహించుట ముదావహము.

**బాలవిజ్ఞాన మందిరం :**

రాజమండ్రిలో గోదావరీ కలపవర్తక సంఘము బాలవిజ్ఞాన మందిర్ అను ఇంగ్లీషు మీడియమ్ ఉన్నత పాఠశాలను, జూనియర్ కళాశాలను నడుపుచు విద్యావ్యాప్తికి తమ వంతు కృషి చేయుచున్నది. ఈ సంస్థలు శ్రీరామ్‌నగర్‌లో ఉన్నవి. రాజమండ్రిలో విజయశంకర సంగీత కళాశాల, శ్రీ సీతారామాచార్య చిత్రలేఖన కళాశాల, శ్రీ జి.యస్.కృష్ణన్యాయకళాశాల, శ్రీమతి అద్దేపల్లి మహాలక్ష్మి బి.ఇడి. కళాశాల, వేదశాస్త్ర పాఠశాల, ప్రభుత్వ జూనియర్ కళాశాల మరియు అనేక మున్సిపల్ పాఠశాలలు విద్యాబోధనకు గణనీయమైన పాత్ర నిర్వహించుచున్నవి.

# రాజమండ్రి పత్రికారంగం – నాడు, నేడు

నన్నయ్య నాటి నుంచి రాజమహేంద్రవర సాహిత్యచరిత్ర చెప్పుకున్నట్లే యుగ ప్రవర్తకుడు, నవ్యాంధ్రనిర్మాత, తెలుగు సాహిత్యంలో అనేక నూతన ప్రక్రియలు సంస్కృతంలో వలెనే ప్రవేశపెట్టిన నవయుగ వైతాళికుడైన స్వర్గీయ కందుకూరి వీరేశలింగం నాటినుంచే పత్రికా రంగంలో రాజమండ్రి పేరు ప్రఖ్యాతులార్జించిందని చెప్పుకోవాలి.

సాహిత్యానికీ, తమ సంఘసంస్కరణోద్యమ విస్తృతికీ, అవినీతి నిర్మూలనకూ సమాజంలో సాంఘిక విలువల పెంపుకూ శ్రీ వీరేశలింగం తమ వివేకవర్థని ద్వారా 1874నుంచీ విశేషకృషి చేశారు. శ్రీ వీరేశలింగం ప్రభుత్వోద్యోగుల అవినీతిని తమ పత్రికద్వారా సునిశితంగా విమర్శించారు. సంఘంలోని మూఢాచారాలను మనసు భగవల్లగ్నం కావటం కాకుండా కేవలం బహిరంగ భక్తి ప్రకటనలను, నటనలను ఆయన తీవ్రంగా విమర్శించేవారు. బాల్యవివాహాలను, భార్య ఉండగా ఉంపుడు కత్తెలతో కులుకుతూ అది ఏదో గొప్పగా భావించే వారిని తమ పత్రికల ద్వారా తీవ్ర విమర్శకు గురి చేసేవారు. ఇట్టివే అనేకమైన సాంఘిక దురాచారాలను, మూఢనమ్మకాలనూ, వాటిని పెంపొందించేవారినీ పత్రికలో ప్రహసనాల ద్వారా వ్యంగ్యంగా నిందించేవారు.

బాల్యవివాహాల నిరోధానికీ, వితంతువివాహాల నిర్వహణకూ కూడా తమ పదునైన కలాన్నీ, పత్రికా రచననూ ఉపయోగించారు.

శ్రీ వీరేశలింగం గారి సహకారంతో ఆంధ్ర భీష్మ శ్రీన్యాపతి సుబ్బారావు "చింతామణి" అనే పత్రికను శ్రీ రాయసం వెంకట శివుడు "జనానా" అనే మహిళాభ్యుదయ పత్రికనూ నడిపారు.

శ్రీ వీరేశలింగం తమ పత్రికలో బ్రహ్మసమాజ ఆదర్శాలను కూడా విరివిగా ప్రచారం చేశారు. "ఇతరులు నీకు ఏం చేస్తే ఇష్టం ఉండదో అది నీవితరులకు చెయ్యకు" అన్న భారత సూక్తి శ్రీ వీరేశలింగం పత్రిక మోటో.

కవి సార్వభౌమ బిరుదాంకితులూ, ప్రభుత్వ ఆస్థానకవి, శతాధిక

ఉత్తమ గ్రంథ రచయిత శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి "కళావతి" అనే గొప్ప సాహిత్య మాస పత్రికను నడిపారు. అందులో అంతవరకూ అముద్రితాలుగా ఉన్నకొన్ని ప్రాచీన కావ్యాలనూ, తమ గ్రంథ రచనలనూ ఆ పత్రికలో క్రమశః ప్రకటించేవారు.

శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రిగారే స్వదేశీ ఉద్యమం వ్యాప్తికై "వందేమాతరం" అనే పత్రిక నడిపారు. "గౌతమీ" అనే దినపత్రికను నడిపారు. అదే రాజమండ్రిలో మొట్టమొదటి దినపత్రిక.

శ్రీ గిడుగు రామమూర్తి వ్యావహారిక తెలుగు భాషాప్రచారం కోసం "తెలుగు" అనే పత్రికను స్థాపిస్తే శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రి ఆ పత్రిక అభిప్రాయాలను ఖండించడంతోపాటు గ్రాంథిక భాషా ప్రతిష్ఠ పెంచడానికి 'వజ్రాయుధం' అనే పత్రికను పెట్టారు.

శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి "ప్రబుద్ధాంధ్ర" అనే మాసపత్రికను పెట్టి తెలుగు కథలను ప్రోత్సహించడంతో పాటు, ముఖ్యంగా సంప్రదాయ బద్ధమైన శిష్టవ్యావహారిక భాషను ఆనాటి పాఠకులకు అందజేశారు.

సుప్రసిద్ధ దేశ భక్తులు శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య 'కాంగ్రెస్' అనే పత్రికను ముందు సైక్లోస్టయిల్ చేసి, తర్వాత ముద్రించి 1921నుండి 1925 వరకూ రాజమండ్రిలో నడిపారు. వారుదీని ద్వారా బ్రిటిష్ పాలననూ అంతమొందించే పోరాటోన్ముఖులుగా ప్రజలను, ముఖ్యంగా యువకులనూ ఉద్బోధించారు. ఈ పత్రికలోని తమ వ్రాతల వల్ల రెండు ఏళ్ళు జైలుకు కూడా వెళ్ళారు.

శ్రీ క్రొవ్విడి లింగరాజు కూడా ఈ పత్రిక బాధ్యత వహించారు.

శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య "నవశక్తి" అనేవార పత్రికను పెట్టి యువకుల్లో సామ్యవాద భావాలను పెంపొందించారు. ఆయనే "తెలుగు" అనే ఆధ్యాత్మిక వారపత్రికను మెహర్ బాబావారి ప్రబోధాల ప్రచారానికి నడిపారు.

తమ రాజకీయ భావ ప్రచారం కోసం శ్రీ క్రొవ్విడి లింగరాజు

"గోదావరి" అనే దిన పత్రికను ఇక్కడ నడిపారు.

చిలకమర్రి సత్యనారాయణాచార్య "శ్రమజీవి" అనే పత్రిక ద్వారా మున్సిపల్ రాజకీయాల మీద వ్యంగ్య విమర్శలు చేసేవారు. ఆయనకు ఆఖరికి శ్రమజీవాచారి అనే పేరొచ్చింది.

విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి గారు "సమాలోచన" అనే పత్రికద్వారా భాషా శుద్ధికీ, సాహిత్య విలువల స్థాయికీ పాటు పడ్డారు. వారి అనంతరం వారి కుమారులు శ్రీ బులుసు రవికాంత్ ఆ పత్రికను ఆ దిశలోనే నడుపుతూ కొంచెం మోడర్న్ ట్రెండ్ కోసం కూడా చూస్తున్నట్లున్నారు

రాజమండ్రిలో "రాజమండ్రి సమాచారం"గా శ్రీ గంధం ఆంజనేయులు ప్రారంభించిన దినపత్రిక సమాచారమ్. నేడు వారి కుమారుడు శ్రీ గంధం నాగ సుబ్రహ్మణ్యం చేతిలో మహోదాభివృద్ధివైపు పరుగులు తీస్తోంది.

శ్రీ కూచిమంచి సుబ్రహ్మణ్యం చేతిలో కేవలం విశ్లేషణాపూర్ణ సంపాదకీయాలకు ప్రాచుర్యం పొందిన శ్రీ చింతల గోపాలరావు 'కోస్తావాణి' తన కళేబరోచితంగా లేఖిన్యుక్తి వివిధ విన్యాసాలతో నడుస్తోంది.

"ప్రజాప్రభ" శ్రీ ఎన్.వి.చౌదరి సంపాదకత్వంలో "మంచిరోజు" శ్రీ సి.వి. పూర్ణచంద్రరావు సంపాదకత్వంలో, 'రాజమండ్రి టైమ్స్' శ్రీ చిలుకూరి సాయిబాబా మేనేజ్‌మెంటులో క్రమం తప్పక దినపత్రికలుగా వస్తున్నాయి. ఇవి గాక అనేక వారపత్రికలు, మాసపత్రికలు, రాజమండ్రిలో నడుస్తున్నాయి. కేవలం, క్రైస్తవ మత ప్రచారానికి ఉద్దేశించబడి సమర్థవంతంగా నడుస్తోన్న ఐదారు పత్రికలు కూడా రాజమండ్రిలో ఉన్నాయి.

ఏది ఏమైనా వీరేశలింగంగారి నాటినుంచీ నేటివరకూ ఆంధ్రపత్రికా రంగంలో రాజమండ్రి తనపేరును నిలుపుకొంటూనే ఉందనీ ఇది ఇన్‌ఫర్మేషన్ అండ్ పబ్లిక్ రిలేషన్స్‌వారి పేట్రనేజ్‌తో త్వరలోనే ఎన్నో కొత్తకొత్త వన్నె చిన్నెలతో ఇంకా ఎంతో ముందుకి రాజమండ్రి పత్రికారంగం పురోగమించగలదని హృదయ పూర్వకంగా ఆశిస్తున్నాను.

"రచన"

ఆర్.బి. పెండ్యాల.

# ఆంధ్రదేశంలో తొలి పురమందిరం

– శ్రీ పోతుల వీరభద్రరావు
మాజీ మున్సిపల్ చైర్మన్, ఎం.ఎల్.ఏ.,
ప్రెసిడెంట్, జూబ్లీ పబ్లిక్ లైబ్రరీ &
రీడింగ్ రూమ్ సమాజ్ టవున్‌హాల్

యుగపురుషుడు శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు గారు తెలుగు వారి సర్వతోముఖాభివృద్ధికై సాంఘిక, సాహిత్య రంగాలలో కృషి చేసిన మహా పురుషుడు. పట్టణ ప్రజలు వివిధ సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణకు ఒక పురమందిరం అవసరమని ఆయన గుర్తించారు. అది 1880సంవత్సరం ఆగష్టు 15. ఆరోజు రాజమహేంద్రి ప్రజలు గుర్తుపెట్టుకోవలసిన రోజు. ఈ నగరములో టౌన్‌హాలు నిర్మాణానికి పురప్రముఖులు సమావేశమైన రోజు. ఆంధ్రదేశంలో అంతవరకు టౌన్‌హాల్ లేదు. బెంగాల్‌లో ఇటువంటి భవనాలు ప్రజలకు ఎంతో సహాయంగా వున్నాయి. బెంగాల్ ప్రభావం వీరేశలింగంగారి మీద పడిందనడానికి అనేక దాఖలాలు వున్నాయి. రాజారామ్ మోహన్‌రాయ్ ఆయనకు ఆదర్శ పురుషుడు. ఆయన ఏర్పాటు చేసిన సభలో టౌన్‌హాల్ ఆవశ్యకతను వివరించి పుర ప్రముఖుల సహాయాన్ని ఆర్థించారు. అయితే ఆశించినంతగా చందాలు రాని పరిస్థితి ఏర్పడి నందున తాము అనుకున్న పురమందిర నిర్మాణానికి తమ సొంత ధనంతోనే చేయాలన్న కృత నిశ్చయానికి పంతులుగారు వచ్చారు. ఎట్టకేలకు రాజవీధికి సమీపంలోని కొన్ని స్థలాలను కొన్నారు. ఆయన వ్రాసిన పుస్తకాలు అమ్మకాల వలనను, ఏపరీక్షలలోనైనా ఎగ్జామినర్‌గా వెళ్ళినపుడు వచ్చిన డబ్బుతోను టౌన్‌హాల్ నిర్మించుట జరిగింది. అయితే నిర్మాణానికి ముందే రకరకాల ఇబ్బందులు కొందరు పెద్ద మనుషులు తెచ్చారు. వాటి పరిష్కారానికి కోర్టుకుకూడా వెళ్ళవలసి వచ్చింది. అనుకున్న పని సాధించేవరకు ఆయనకు నిద్రపట్టదు అనడానికి టౌన్‌హాలు నిర్మాణాన్ని ఖచ్చితంగా పేర్కొనవచ్చు. ఎంతో

శ్రమపడి నాణ్యమైన కలపతో నిర్మాణము చేయించారు. వీరికి కలప వర్తకులైన జోగా చినవెంకట స్వామి, కోట్ల పోతన్న సహాయ పడినారు. ఈ స్థలంలో మనుష్యుల ఎముకలు వున్నాయని కొందరు అభ్యర్థన తెల్పారు. అవి జంతువులివి అని ఆయన నిరూపించారు. 1890 అక్టోబరు నెలలో పురమందిరము తయారైనది. అప్పట్లో మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో సంస్కృతోపన్యాసకులుగా వున్న రావు బహదూర్ రంగాచార్యులుగారు యీ పురమందిరములో వీరేశలింగంగారి గురించి ఆంగ్లంలో ఆనెల 23వ తేదీ ఉపన్యాసం ఇచ్చారు. తరువాత నవంబరు 15న కలకత్తాకు చెందిన బ్రహ్మసమాజ బోధకులు పండిత శివనాధశాస్త్రి ఈ పురమందిరంలో ఉపన్యాసం ఇచ్చి రాజమహేంద్రపురవాసులు అప్పటి నుండి నిరాటంకంగా సభలు చేసుకొన వచ్చునని ఉద్ఘాటించిరి.

వీరేశలింగం పంతులు గారు మద్రాసుపోవుటకు ముందు 1897వ సంవత్సరము డిసెంబరు 3న ఈ పురమందిరాన్ని పుర ప్రముఖులకు అప్పగిస్తూ ఒక ట్రస్టుడీడ్‌ను రాజమండ్రి సబ్ రిజిస్ట్రారుఆఫీసులో రిజిస్ట్రేషన్ చేయించినారు. ట్రస్టుబోర్డుకు ప్రధమ అధ్యక్షులు ఆంధ్రభీష్మ శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులు. ఆయనే మొదటి మునిసిపల్ ఛైర్మన్ కూడా. ట్రస్టుబోర్డు ప్రధమ కార్యదర్శిగా చిత్రపు వెంకటాచలంగారిని నియమించారు. సంతోషదాయకమైన విషయం ఏమిటంటే ఆ అధ్యక్షుల, కార్యదర్శుల మనుమలు ప్రస్తుతం మాట్రస్టుబోర్డు సభ్యులుగా వుండడము. మొత్తం 13 సభ్యులతో ఆయన ట్రస్టుబోర్డు నియమించారు. విశేషమేమంటే తాము అందులో సభ్యులుగా వుండకపోవడమే. ఆయన నిస్వార్ధత ఇందులో తెలుస్తుంది. సాధారణంగా ఎవరైనా ట్రస్టు బోర్డును ఏర్పాటు చేస్తే తాము జీవితాంతం అందులో వుండటానికి ఏర్పాటు చేసుకుంటారు. ఆయన విధించిన మరొక షరతు ఏమిటంటే ట్రస్టు బోర్డు మెంబర్లు అంతా గ్రాడ్యుయేట్స్‌గా వుండాలన్నది.

ఆయన దూరదృష్టికి నిదర్శనంగా ఒక విషయం మనం చెప్పుకోవాలి. రిజర్వేషన్ సూత్రాన్ని శతాబ్దం వెనుక ఆయనే సూచించారు. ఈ ట్రస్టు బోర్డులో ఒకముస్లిం, ఒక క్రిష్టియన్, ఒక వైశ్యుడు, ఒక శూద్రుడు, వుండాలన్న నియమాన్ని ఆయన పెట్టారు. దీన్ని చూసి చాలామంది ఆశ్చర్యాన్ని వ్యక్తం చేస్తుంటారు ప్రార్థనా మందిరాన్ని టవును హాలుకు అనుకునే తర్వాత కట్టించారు. దాన్ని రఘుపతి వెంకటరత్నంగారు ప్రారంబించారు. టౌన్‌హాలుకు ప్రార్థనా మందిరానికి మధ్యనున్న వసారా ఉమ్మడిగా వాడుకోవాలని ఆయన సూచించారు. ఎప్పుడైనా ప్రార్థనా సమాజం మూతపడితే ఆ భాగాన్ని కూడా టౌన్‌హాల్ వారే ఉపయోగించుకోవాలని సూచించారు. ఒకసారి పోయిన తర్వాత మరల ఎప్పుడైన ప్రార్థనా సమాజం ఏర్పడిన పక్షమున ఆ భాగము మరలా దాని క్రింద ఉపయోగించాలనిచెప్పారు అన్ని జాతులు వారు అన్ని మతములు వారు ఈ మందిరములో సభలను నిర్వహించుకోవచ్చు నన్నారు. ఇక్కడకు వచ్చి చదువుకునే వారందరకును ఉపయోగ పడుచు జాబ్లీ లైబ్రరీ, రీడింగ్ రూమ్ స్థిరంగా టౌన్‌హాలులో వుండాలని ఆయన కోరుకున్నారు. ఈ మందిరాన్ని అన్యాక్రాంతం చేయరాదని సొంతానికి ఉపయోగించుకో కూడదని ఆయన ఆంక్ష విధించారు. ట్రస్ట్ బోర్డులో ఖాళీ ఏర్పడినప్పుడు మిగిలిన సభ్యులు కోఅప్ట్ చేసుకోవాలన్న నిబంధనను విధించారు. ఈ ప్రకారముగా పంతులు గారు ఎంతో దూరదృష్టితో వ్రాసిన ట్రస్టుడీడ్‌కు అనుగుణంగానే ప్రస్తుత ట్రస్టుబోర్డు వ్యవహరిస్తున్నదని చెప్పడానికి ఎంతో సంతోషిస్తున్నాను.

## సాంస్కృతిక కార్యక్రమాలు

1960 సంవత్సరంలో ప్రజల ఉపయోగ నిమిత్తం టౌన్‌హాలు ఆవరణలోరెండు గ్రీన్ రూమ్స్‌తో సహా పక్కాగా ఓపెన్ ఎయిర్ థియేటర్‌ను నిర్మించాం. ఇందులో నాటకాలు, నాటికలు, సంగీతసభలు, నృత్యకార్యక్రమాలు, సభలు నిరంతరం జరుగుతూనే వున్నాయి. గత పదిసంవత్సరాలుగా ఈ

టౌన్ హాలు ఆవరణలో ఎంతో శ్రమ కూర్చి పుస్తక ప్రదర్శనను నిర్వహిస్తున్నాము. దీని వలన మంచి పుస్తకాలను కొనుక్కోవాలన్న ఆకాంక్ష ఈ పట్టణ విద్యావంతులకే గాక, పరిసర జిల్లాలో వారికి కూడా కల్గింది. పార్టీ వివక్షత లేకుండా అందరూ అన్నివర్గాల వారు ఈ టౌన్ హాలులో సభలు, సమావేశాలు, సాంస్కృతిక ఉత్సవాలు నిర్వహించుకోడానికి పంతులుగారి ఆశయాలకు అనుగుణంగా ఎటువంటి అద్దెలేకుండా అనుమతిస్తున్నాము . ఆంధ్రకేసరి సెంటెనరి జూనియర్ కాలేజీలో ఒకగది నిర్మాణానికి టవునుహాలు ఆర్థిక సహాయాన్ని అందజేసింది. ప్రాచీనమైన తైలవర్ణ చిత్రలే గాక, మరికొన్నింటిని కూడా ఇందులో చేర్చాము. వాటిలో ముఖ్యమైనవి ఆదికవి నన్నయ, శ్రీనాథ మహాకవి, మహాత్మాగాంధీ మొదలగు వారు.

అనేక మంది మహాపురుషులు ఇక్కడ ఉపన్యాసాలు ఇచ్చారు. కనుకనే ఇది చారిత్రిక ప్రదేశమైంది అందువలన దీన్ని రక్షిత కట్టడముగా గుర్తించవలసినదిగా రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరడం జరిగింది. వారు అంగీకరిస్తున్నారని తెలియజేయడానికి ఎంతో ఆనందిస్తున్నాము. ప్రస్తుతం ట్రస్టుబోర్డు అధ్యక్ష, కార్యదర్శులుగా, శ్రీ పులిపాక కామేశ్వరరావు, శ్రీ వై.యస్.నరసింహారావు గార్లు ఉన్నారు. ఇది టౌన్ హాల్ శత జయంతి సంవత్సరము పైగా గోదావరి పుష్కర సంవత్సరం. అందరికీ నా శుభాకాంక్షలు.

# నాట్యవిన్యాసాల నది గోదావరి

సప్పా దుర్గాప్రసాద్

ప్రాచీన కాలంనుండి ప్రతి విషయంలోనూ భారతావనికి ఒక ప్రత్యేకతను, ఒక విశిష్ట స్థానాన్ని అందించారు మన పూర్వీకులు. భిన్న సంస్కృతులు, విభిన్న సాంప్రదాయాలు ఎన్ని ఉన్నా – ఆలోచిస్తే అందరివీ ఒకేదారి. అదే మన భారతజాతి విశిష్టత. అందుకే మనది పుణ్యభూమి అని ప్రపంచ ప్రజలచే పూజింపబడుతోంది. రాముడు, కృష్ణుడు, బుద్ధుడు పుట్టిన ఈ భూమే. క్రీస్తుకు మార్గదర్శకం అయిందంటే ఆశ్చర్యంలేదు.

భారతావనిలో ఎన్నో, ఎన్నెన్నో నదులు కన్నతల్లులై మనలను లాలించినా గోదావరి తల్లికి ఉన్న చరిత్ర మరే నదికి లేదు. ఎందుకంటే ఈ తల్లి సాత్వికురాలు, కోపతాపాలకు ఆమడదూరం. ఈమాత పౌరుషానికి పెట్టింది పేరు. అయినా ఈ తల్లి తన పుత్రులందరినీ సాత్విక స్వభావులుగా కళా హృదయులుగానే తీర్చిదిద్దింది. అందుకే ఆంధ్రావనిలో ఈ మాత అగ్రస్థానం అలంకరించింది ప్రతిరంగంలోనూ..ఎక్కడో నాసికా త్రయంబకాన జన్మించిన తల్లి మన ఆంధ్ర తీరాన సాగర గర్భంలో కలిసి మనకు పట్టెడన్నం పెడుతోంది. మనచేత అందరికీ పెట్టిస్తోంది. ఆంధ్రావనిలో ఎన్ని సంస్కృతులు పుట్టినా ఈ గోదావరి తీరం వాటన్నింటికీ మూలం. ఎందుకంటే భారతావనిలో పేరెన్నికగన్న ఎందరో చరిత్ర కారులు ఈ నీరు త్రాగి, ఈ మాత ఒడిలో సేద తీర్చు కొన్నవారే.

ఇక పోతే మనం చెప్పుకోవలసింది నాట్యరంగానికి సంబంధించిన విషయం. గత రెండు వేల సంవత్సరాలుగా ఈ గోదావరి తీర నాట్యరంగానికి చరిత్రలో ఒక విశిష్ట స్థానం ఉంది. ఈ గోదావరి తీరం అభినయానికి నిలయం ఈ తీరవాసుల అభినయానికి ప్రపంచ ప్రజలందరూ తలలువంచి నమస్కరించారు.

అభినయం మానవుని హృదయ భాష.

అభినమాన అగ్రగణ్యులు ఆంధ్రులు.

అభినయం ఆంధ్రులకు నేర్పింది గోదావరీ తీరం.

పూర్వకాలంనుండి గోదావరి మాత తన పుత్రులను కళాకారులుగా కళాకోవిదులుగా తీర్చిదిద్ది అగ్రస్థానాన నిలబెడుతూనే ఉంది.

నన్నయ చేత భారతం రచింపజేసినా లకుమటాపాన కొమరగిరి రెడ్డిచే "వసంతరాజీవం" అనే నృత్యశాస్త్రం రచింపజేసినా– ఒక నాట్యకళాకారిణిని అమ్మవారిగా పూజింపజేసినా– నారాయణ తీర్ధునిచే నృత్య తరంగాలు రచింపజేసినా– గోపన్నను కీర్తనలు పాడించి రామదాసును చేసినా– కాటన్ మహాశయుని అపరభగీరధుని చేసినా– ప్రకాశాన్ని ఆంధ్రకేసరిని జేసినా– ఏంచేసినా, ఎలాజేసినా అంతా ఈ మాతచలువే. ఈ గోదావరి తీరవాసులు సాత్వికులు, శాంత స్వరూపులు, కళా కారులు కావల్సిందే. ఖచ్చితంగా కారణం ఈ నీటి మహత్యం అది. ఈ మాత తన ప్రవాహంతో బీటలువారిన బీడులను సస్యశ్యామలం జేయటమేగాదు. బండవారిన గుండెలో సైతం కళలను చిగురింప జేసి కళాకారునిగా మార్చి అతని ద్వారా ఒక సందేశాన్ని, సాంప్రదాయాన్ని ప్రపంచానికి అందిస్తుంది.

అదే ఈ గోదారి మాతలోని మరువలేని మరపురాని గుణం. ఈ గోదావరి తీరాన అనేకానేక నృత్య సాంప్రదాయాలు ప్రచారం పొందాయి. సాత్వికాభినయం వాటిలో ముఖ్యం అయ్యింది. ఈ సాత్వికాభినయానికి పార్వతిదేవి మూలం అయినా ఊర్వశిద్వారా భూలోకాన ప్రచారం పొందినా, గోదావరి తీరవాసుల మోములలో మాత్రమే నిలిచిపోయింది . అందుకే ఆదిశంకరుని అమరుక శ్లోకాలు, జయదేవకవి అష్టపదులు వంటి క్లిష్ట రచనలకు అభినయం చూపగల దిట్టలు ఈ తీరవాసులే.

యతీంద్రుడయిన నారాయణ తీర్థుడు సంస్కృతంలో తరంగాలు రచించారు. శ్రీకృష్ణుని లీలలను వర్ణిస్తూ రచింపబడిన రచనలు సముద్ర తరంగాల వలే అలలు అలలుగా శ్రావ్యంగా వనసొంపుగా ఉంటాయి గనుకనే

వాటికి "తరంగాలు" అనే పేరు వచ్చింది. ఉత్తర భారతావనిలో అభంగాలకు ఎంత విశిష్టత ఉన్నదో ఈ తరంగాలకు అంత విశిష్టత ఉంది నృత్యకళాకారులు పూర్వం నుండి ఈ నాటి వరకూ తరంగాలకు నర్తించడం, అభినయించడం, పదాభినయం, పాదాభినయం చేయడం కష్టం. నర్తకుని విద్యను, నృత్యకళా శక్తి సామర్ధ్యాలు అంచనా వేయడానికి ఉపయోగ పడతాయి తరంగాలు.

ఉదా : నీల మేఘశరీరా,

'కృష్ణం కలయసఖి సుందరం',

'ఆలోకయే శ్రీ బాలకృష్ణం',

'ఇందిరా మందిరా భక్తి' వంటి ఎన్నో తరంగాలకు నృత్యం చేయడం జరుగుతోంది. ఈ తరంగాలు గోదావరితీరానివే.

ఇక గోదావరి తీర వాసులు నాట్యరంగానికి ఎంతటి విశిష్ట స్థానాన్ని ఇచ్చారో ఒక చిన్ని కథతో వివరిస్తాను.

తూర్పుగోదావరి జిల్లాలోని ద్రాక్షారామం గ్రామంలో భీమేశ్వరస్వామి ఆలయంలో మాణిక్యాంబ అనే ఆలయనర్తకి ఉండేది చిన్ననాట తన తల్లి తండ్రులు స్వామికి అప్పగించిన నాటినుండి ఆగమ నృత్యశాస్త్రంలో, సంగీత సాహిత్యాలలో దిట్టయై ప్రతిదినం తన నృత్యంతో స్వామిని మేల్కొలిపి, తన అభినయంతో స్నానమాడించి, అలంకరించి, ఆనందింపజేసి, తన నృత్యగానాలతో జోలపాడి పవళింపు సేవజేసి నిద్రపుచ్చేది. ఆమె అస్ఖలిత బ్రహ్మచారిణి. తన సర్వస్వం భీమేశ్వరస్వామే అన్నట్లుగా నిరంతరం స్వామికి సేవలందించింది. అందుకే ఆ ప్రాంత ప్రజలందరికీ ఆమె అమ్మ అయ్యింది. చిన్ననాటినుండి స్వామిని సేవించి, తన ఆత్మను స్వామికే అర్పించి తనువుచాలించింది వృద్ధురాలయిన మాణిక్యాంబ. ఆమెపై గల గౌరవం కొద్ది ఆప్రాంత ప్రజలు ఆమెనే అమ్మవారుగా ఆరాధించారు. అందుకే ఈనాటికీ ద్రాక్షారామం భీమేశ్వరుని సన్నిధిని అమ్మవారు మాణిక్యాంబగా పూజలందు కొంటుంది. ఒక నాట్యకళాకారిణికి అంతటి విశిష్ట స్థానం కల్గిందంటే నాట్యకళకు ఆ ప్రాంత ప్రజలెంత ప్రాధాన్యత నిచ్చారో మనం ఊహించవచ్చు.

ఇక గోదావరి తీర వాసుల నాట్య ప్రియత్వానికి రెండవ ఉదాహరణం. ముందు భాగం విష్ణుమూర్తిగా వెనుక భాగం జగన్మోహినిగా పూజలందుకొంటున్న ర్యాలిలోని జగన్మోహినీ కేశవ స్వామి. విష్ణువు సాత్వికాభినయ నాట్యప్రియుడు. మోహిని నాట్యకళాకారిణి రూపున విష్ణువు అవతారం. క్షీరసాగర మథనం జరుగుతోంది. సాగరంలో పుట్టిన హాలాహలాన్ని నాట్యాధి దేవుడు గళాన నింపుకుంటే, తరువాత అమృతంతో పుట్టిన కోలాహలాన్ని దాని తరువాత జరుగబోయే విపత్కర పరిణామాల్ని ఊహించిన విష్ణుమూర్తి మోహినిగా తన నాట్య విన్యాసాలతో రాక్షసులను ఆదమరిచేలా చేసి, దేవతలకు అమృతం అందించాడు. ఆనాటి ఆస్వామిది జగన్మోహనరూపం. జగతిని మైమరపింప జేసిన నాట్యం. అందుకే ర్యాలిలోని స్వామి పేరు జగన్మోహినీ కేశవస్వామి. ఈ ప్రాంత ప్రజల నాట్యప్రియత్వానికి, నాట్యకళా పాండిత్యానికి నిదర్శనం.

ఇక గోదావరి తీరానగల నృత్యశిల్పాల విషయానికివస్తే నృత్యవిన్యాసాలు మలచని స్తంభాలు ఈ ప్రాంతపు ఆలయంలో అరుదు. ఆ శిల్పాలకు స్ఫూర్తి ఆనాటి నాట్యకళా కారిణులేగదా. మరోముఖ్య విషయం. భారతావనిలో ఎక్కడా నృత్యం ఎలా చేయాలో తెల్పే శిల్పాలు లేవు కానీ, గోదావరి తీరంలోని ఒక ఆలయంలో నృత్యం ఎలా చెయ్యాలో నేర్చుకునేందుకు వీలయిన శిల్పం ఉంది. అది పాలకొల్లు శ్రీ రామ లింగేశ్వరుని నాట్యమంటపం లోనే ఉండడం విశేషం. ఇంచుమించుగా ప్రతి ఆలయంలోను దేవాలయ నర్తకీమణులు స్వామివారికి చేసే షోడశోపచారాలులో నృత్యపూజ చేసేవారు. అందుకే ఈ తీరంలోని ప్రతి ఆలయంలోను నాట్యమంటపాలున్నాయి. ప్రతిదినం ఆలయాలలో నృత్యకేళికలు జరిగేవి. ఈ ప్రాంతంలోని నృత్యప్రదర్శనలకు కేళికలు, నాట్యమేళాలు అని పేర్లుండేవి. ముఖ్యంగా ఈ ప్రాంతాన్ని పాలించిన చాళుక్యవేంగి, రెడ్డిరాజులు, పిఠాపురం, పెద్దాపురం వంటి జమిందారులు ఇంకెందరో సంస్థానాధీశులు నాట్యకళను పోషించి దాని అభివృద్ధికి, ప్రచారానికి తమ సహాయ సహకారాలు అందించారు. భారతావనిలో మరెక్కడా లేని ఒక విశిష్ట నృత్య ప్రక్రియ సజీవంగా ఈనాటికీ నిలిచి ఉంది

ఈ తీరాన. ఈనాట్య సాంప్రదాయమది. దీని సృష్టికర్తలం మేము అని గర్వంగా చెప్పుకొంటున్నాం. ఈ సత్ సాంప్రదాయ నృత్యకళను గూర్చి ఈనాటికీ గోదావరి తీరాన శ్రీ పిఠాపురంలో కుంతిమాధవస్వామి ఆలయం ...ద. అక్కడే పెండేల నృత్యభాను అనే నాట్యకళాకోవిదురాలు ఉండేది ఆమె భామాకలాపంలో దిట్ట.

**భామాకలాపం :**

శ్రీ కృష్ణుడు అతని అష్టభార్యలలో ఒక్కతె అయిన సత్యభామల మధ్య జరిగే ప్రణయకలహం.

శ్రీకృష్ణుని పరమాత్మునిగా ముల్లోకాలు ఆయన పాదాలకు పూజిస్తే ఆస్వామినే తనకాలితో తన్నింది సత్యభామ. సత్యభామ ఆంధ్రుల ఆడపడుచు. ఉత్తరాదివారు రుక్మిణి, రాధలకు పూజలు చేస్తున్నారు. కానీ ఆంధ్రులు భామను ఆరాధిస్తున్నారు. సత్యభామకు ఒక విశిష్టస్థానం కల్పించింది ఆంధ్రులే. అందుకే ఆమె ఆంధ్రుల ఆడపడుచు. సత్యభామకు నాట్యరంగాన ఒక విశిష్ట స్థానముంది. ఆ స్థానం ఎంతగొప్పదంటే వర్ణనలకు అతీతమయ్యింది ప్రపంచ ప్రజలందరూ ఆంధ్రదేశ నాట్య సాంప్రదాయానికి జేజేలు పలుకుతున్నారంటే ఒక కారణం భామాకలాపమే. అసలు కలాపం కథ ఈవిధంగా రూపొందింది. ఒకనాడు సత్యభామను నిద్దుర నుండి లేపి ఆమెకు సర్వాలంకారాలు అలంకరింపజేసి నిలువుటద్దం ముందు నిల్చోబెట్టి సత్యభామా ఇప్పుడు నీవు అందంగా ఉన్నావా? లేక నేను అందంగా ఉన్నానా! అని శ్రీ కృష్ణుడు అడిగాడట. అబద్ధం అంటే తెలియని సత్యాదేవి నేనే అందంగా ఉన్నానని అందట. అందుకు శ్రీకృష్ణుడు అలిగి ఆమెమందిరం నుండి వెళ్ళిపోయాడట. ఆనాటినుండి అతనికోసం పరితపించి, తిరిగి తన మందిరానికి రప్పించుకొనేందుకు ఆమె చేసే అట్టహాసమే నర్తనరూపం భామాకలాపం అయ్యింది. ఈ భామాకలాపాన్ని కృష్ణాతీర వాసులు మూడురాత్రులు నర్తించే గ్రంథంగా రూపొందిస్తే. గోదావరితీరవాసులు తొమ్మిది రాత్రులు నర్తించే

గ్రంథంగా ఆడినదరువు ఆడకుండా ఉండేలా రూపొందించారు. ఇందులో ఏకాదశ భావాలు సాహిత్యరూపంలోనూ, అష్టాదశ రాగాలు సంగీతంగానూ, సప్తతాళాలు మృదంగం జతులుగానూ, చతుర్దశ విన్యాసాలు, నవరసాలు నాట్యవిన్యాసాలుగా అన్నిరంగాలు కలబోసి ఒక నర్తన విశేషంగా నిత్యనూతన మయిన ప్రక్రియగా రూపొందింది. అందుకే ఇది నవజనార్దన పారిజాతం అనిపేరు పొందింది. అంతేగాక తొమ్మిది రాత్రులు నర్తించే నర్తనం గనుక "నవజనార్థన పారిజాతం" అయ్యింది.

సత్యభామ సౌందర్య గర్విత, ప్రగల్భనాయిక, స్వాధీనపతిక, రూపసి, అందుకే ఆమె అష్టభార్యలలో ముఖ్యురాలయ్యింది. అంతేగాక, ఆమె వీరనారి కూడా. నరకాసురుని వధించిన వీరవనిత ఆమె. గోదావరి తీరాన ఆనాడు రావూరి కోటయ్య, ఆకెళ్ళ సుబ్రహ్మణ్యం పురిపళ్ళ వెంకటశాస్త్రి వంటి నాట్యాచార్యులు, సాహిత్యవేత్తలేగాక దుగ్గిరాల మాణిక్యాంబ, దూపం సోదరీమణులు, చింతా చినగనిరాజు, అన్నా బత్తుల బులివెంకటరత్నం, అన్నాబత్తుల విజయగోపాలరత్నం, చిత్తజల్లు వైదేహి, ఇందువదన వంటి ఎందరో నాట్యశాస్త్ర విదుషీమణులు గోదావరి తీరాన నాట్యరంగాన ప్రసిద్ధులయినారు. ఎంతటి ప్రసిద్ధులో తెల్పేందుకొక చిన్న సంఘటనను వివరిస్తాను. అది 1940లో అన్నవరం సత్యనారాయణ స్వామి వారి కళ్యాణోత్సవాలలో సభజరుగుతోంది. సభలో చర్లభాష్యంకరశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, పీసుపాటి చిదంబరశాస్త్రి గార్ల వంటి పండితులు హాజరయ్యారాసభకు. ఆ సభలోనే పెండేల సత్యభామ గారు ఉన్నారు. రాజావారు స్వామి ఆలయం తరపున అందరికీ పండిత తాంబూలం ఇస్తూ సత్యభామగార్ని చూసి ఇలా అన్నారు. సత్యభామా ఈ పండితులందరికీ ఒకే తాంబూలం, కానీ నీకు రెండు తాంబూలాలు. అంటూ ఛలోక్తి విసిరారు. రెండు తాంబూలాల సాంప్రదాయమర్యాద శ్రీ హర్షునిది. జయచంద్రమహారాజా ఆస్థానంలో రెండు తాంబూలాలు అందుకొనేవాడు. శ్రీ హర్షుడు. ఆ తరువాత పెండేల సత్యభామది మాత్రమే. రెండుతాంబూలాలు అంటే ఒక్కటి

పండితులతో పాటుగా, రెండవది నవజనార్ధన పారిజాతం ప్రదర్శనా తాంబూలం. పండిత సభ ముగింపులో సత్యభామ గార్ని అభినయించమన్నారు పండితోత్తములు.

పెండేల సత్యభామగారు అభినయించారు. ఆనాటి ఆమె అభినయం అమోఘ

భళా సత్యభామా అన్నారు చిదంబర శాస్త్రిగారు

భళా అంటూ మెచ్చుకోవడమేగాదు శాస్త్రిగారు కళాకారిణిని సన్మానించాలి అన్నారు రాజావారు.

మాదగ్గరేముంది, మీరిస్తే పుచ్చుకొనే వారమేగానీ బదులిచ్చారు శాస్త్రిగారు.

ఏమీలేవా? అంటూ ఆయన ధరించిన కర్ణకుండలాలు వంక చూశారు రాజావారు. సందేహించారు శాస్త్రిగారు. ఎందుకంటే ఆకర్ణభూషణాలు రాజావారి ఆస్థానంలో శతావధానానికి మెచ్చి రాజావారు ఇచ్చిన వజ్రాల కమ్మలు అవి.

అయినా సందేహించకుండా వాటినితీసి సత్యభామ గార్కి ఇచ్చారు. అందరు పండితులను మెప్పించి, పండితులతోనే సన్మానింపబడ్డ సత్యభామ గారి అభినయం, నృత్యం అమోఘం. శాస్త్రిగారినుండి కమ్మలు అందుకొన్నారు సత్యభామగారు. అయ్యా! నాకీ గౌరవం చాలు, నాజన్మ ధన్యం అయ్యింది. మీకమ్మలు మీవే అంటూ ఆయన కర్ణభూషణాలను తిరిగి ఆయనకే ఇచ్చివేశారు.

ఇది ఒక ఉదాహరణ మాత్రమే. ఇలాంటి సంఘటనలు గోదావరి తీర నాట్యకళాకారుల జీవితాలలో కోకొల్లలు.

నాట్యంలో అంతటి గొప్ప చరిత్ర గలదీ గోదావరి తీరం.

## రాజమహేంద్రవర నాట్యవైభవం :

వేయి వసంతాల కీర్తి ప్రతిష్టలు గల్గిన అతిపురాతన నగరం రాజమహేంద్రవరం. అనంతమయిన చరిత్రగల ఈ పట్టణంలో నాట్యకళా ప్రారంభం ఏనాడు జరిగిందో, ఏరాజులకాలంలో ఎలాంటి నాట్యవిన్యాసాలు

నర్తింపబడెవో, ఎవ నర్తకమణులు తమ నాట్యవిన్యాసాలతో ప్రజలను, ప్రజాప్రతినిధులను, పండిత పామరులను మెప్పించారో ఏరాజా ఆస్థానంలో ఏదేవాలయంలో ఏ నర్తకి స్వామిని కీర్తించిందో చెప్పడానికి తగిన ఆధారాలు కనుపించడంలేదు. కానీ, రెడ్డిరాజులు, చాళుక్యుల కొలువులలో నాట్యకళాకారిణులు ఎందరో ఉండేవారు. కానీ వారి పేర్లు తెలియదు నన్నయ్య భారత రచన ప్రస్తావనలో ఆయన రచనకు శ్రీకారం చుట్టించిన రాజరాజనరేంద్రుడు "చూచితి బహునాటక రీతుల" అన్నట్లుగా వ్రాయడం జరిగింది. అంతేగాకుండా ఆనాడు సమాజంలో ఉన్న కళావైభవాన్ని కళాకారుల్ని చూసి సామాజిక స్పృహ, పురాణాల ఆధారంగానే నన్నయ్య భారతాన్ని రచించాడని తెలుస్తుంది నాట్య నృత్యాది దశవిధ రూపకాలు ప్రదర్శించే కళాకారులు రాజరాజ నరేంద్రుని కొలువులో ఉండేవారు అనడానికి నిదర్శనం ఉంది.

రాజరాజ నరేంద్రుని ఆరాధ్యదైవం శ్రీ వేణుగోపాలస్వామి. ప్రతిదినం కోటలోనే గల వేణుగోపాలుని అర్చించేవాడు. రాజరాజు అతడు అర్చించే సమయంలో నృత్యపూజ కూడా జరిగే ఉంటుంది. సంధ్యా సమయంలో కేళికలు జరిగేఉంటాయి కూడా. ప్రతి ఆలయంలో షోడశోపచారాలలో ఒక భాగంగా నృత్యపూజ జరిగేకాలంలో కైవార నర్తనాలు నర్తించేవారు కళాకారిణులు కైవార నర్తనం అంటే ఆ స్వామిని స్తుతిస్తూ ఆయనకే ఆ కీర్తన అంకితమిస్తూ నర్తించే అభినయ ప్రాధానంకల నర్తన విన్యాసాలు అని అర్థం.

ఆలాగే శ్రీశైలం, ద్రాక్షారామం, కాళహస్తి,శ్రీకూర్మం, పిఠాపురం, అరసవిల్లి, రామప్పదేవాలయం, పద్మాక్షిఆలయం, పూరీ, తిరుపతి తదితర ఎన్నో ప్రదేశాలలోని ఆలయాలలో కైవార నర్తనాలు నర్తింపబడేవి ఆ రచనలలో కొన్ని ఈ నాటికీ నర్తింప బడుతున్నాయి. ఈ విధంగానే శ్రీ వేణుగోపాల స్వామి వారి ఆలయంలో నర్తింప బడిందని చెబుతున్న ఒక కీర్తన ఉంది.

'రారా మాయింటికీ కృష్ణయ్యా'- అంటూ ప్రారంభం అయ్యే 'భువి రాజ్మహేంద్ర పురమున వెలసిన వేణుగోపాల దేవా వేగరారా బ్రోవా' అంటూ

ముగుస్తుంది. నాలుగు చరణాలుగా ఈ రచన ఉంది. అభినయానికి అధిక ప్రాధాన్యత నిస్తూ ఈ కీర్తన రచింప బడింది. ఈ కీర్తనపై నర్తనం ఈనాటికీ ప్రాచీన సాంప్రదాయం తెలిసిన నాట్యాచార్యులు నర్తిస్తున్నారుగూడా. దీనినిబట్టి రాజరాజా కాలంలో శ్రీ వేణుగోపాల స్వామి ఆలయంలో నృత్య పూజ జరిగినట్లేగదా. అలాగే ప్రత్యక్ష దైవం రాజు. దైవానికి చేసే సకల సేవలూ రాజుకూ జరగాలి. గనుక రాజాస్థానంలో కూడా నర్తకీమణులు ఉండేవారు అని అనవచ్చును.

ఇక రెడ్డిరాజుల కాలంలో కాటయవేముడు. కొమరగిరి రెడ్డికి బావమరిది కొమరగిరి రెడ్డి నాట్యకళా ప్రియుడు. అతడు వసంతోత్సవాలు నిర్వహించి కర్పూర వసంతరాయలు అనే బిరుదు పొందాడు. అతడు లకుమ అనే నాట్యకళాకారిణి సహాయంతో "వసంత రాజీవం" అనే నాట్యశాస్త్ర గ్రంథం రచించినట్లు ఆధారాలున్నాయి. దురదృష్టవశాత్తు మనకా గ్రంథం లభించలేదు అతడి బావమరిదియై రాజమహేంద్రవరాన్ని బహుమతిగా పొందిన కాటయవేముడు గొప్ప వీరుడే గాక అనేక గ్రాంధాలు రచించిన రచయితకూడా అతడి హయాంలో కూడా నాట్యం పోషింపబడింది. నాట్యకళ అంటే అతడికి అత్యంత ప్రీతి అని తెలుస్తోంది. అవన్నీ గతవైభవానికి సంబంధించిన విషయాలు. అయితే రాజమహేంద్రవరం ఆనాటినుండి ఈనాటి వరకూ నాట్యకళలో తన ప్రత్యేకతను ప్రపంచానికీ చాటుతూనే ఉంది. అందుకే కళలకు పుట్టినిల్లు రాజమహేంద్రవరం అని కీర్తింపబడుతోంది. ఇది జగమెరిగిన సత్యం.

గత ఎన్నో శతాబ్దాలుగా రాజమహేంద్రవర పట్టణానికి వన్నెతెచ్చిన కొందరు నాట్య కళాకారిణులు, నాట్యాచార్యులను గూర్చి చెబుతాను.

శ్రీ బి.వి. నరశింహారావు, చిత్తజల్లు కాంతామణి, హరనాధ్, పువ్వుల సోదరీమణులుగా పేర్గాంచిన గోవిందమ్మ, రాయలమ్మ (వీరి కుమార్తె సినీనటి జయప్రద) సరసీరుహం, దేవతరామ్మోహన రావుగారి కుమార్తె లక్ష్మి గీతాంజలి, కోడూరి సిస్టర్స్, శ్రీమతి శాంత, మణి, రామచంద్రన్, శ్రీనివాస్

వేదాంతం జగన్నాధశర్మ, వహీదారెహ్మాన్, కె.యస్.రెడ్డి, పి.యల్.రెడ్డి, వేదాంతం రాఘవయ్య, వెంపటి పెదసత్యం, వసుమర్తి కృష్ణమూర్తి, సెల్వరాజ్, వంటి ఎందరో నాట్యాచార్యులు ఉండేవారు. వీరిలో కొందరు రాజమండ్రి వారు, అయితే కొందరు రాజమండ్రి పురవాసులకు నాట్యం నేర్పేందుకు విచ్చేసిన వారు కావడం విశేషం. రాజమండ్రి నుండి వెళ్ళి చలన చిత్రరంగంలో స్థిరపడిన కొందరు నాట్యకళాకారిణులు గూర్చి తెలుసుకోవాలంటే వహీదారెహ్మాన్, జయప్రద, జరీనావహాబ్, సౌందర్యరాణి, గీతాంజలి, సుకన్య, ప్రసన్నరాణి మొదలగు వారు ఈ నగరానికి చెందినవారే. ఇక నాట్య రంగంలో మేటిగా కీర్తింప బడుతున్న కుమారి శోభానాయుడు ఈ నగరి ఆడపడుచు అయితే శ్రీమతి పద్మకు శ్రీమతి శారదా రామకృష్ణ ప్రసన్నరాణి, రాజ్యలక్ష్మి వంటి ఎందరో కళాకారిణులకు విద్యనేర్పిన గడ్డ ఈ రాణ్మహేంద్రవరం. సంగీత దర్శకులు టి.వి.రాజా నృత్య సంస్థలకు ఈ నగరంలోనే నృత్య దర్శకులుగా తన జీవితపు తొలి రోజులు గడిపారు. తెలుగు చలన చిత్రరంగంలో ఆనాటి వరూధిని, గొల్లపిల్ల వంటి చిత్రాలలో నటించిన బేబి సత్యనారాయణ కాంతామణి, ఈ నగరానికి చెందినవారే కావడం విశేషం. ఇక ఈనాడు.

కూచిపూడి నాట్యకళలో సిద్ధహస్తులు శ్రీ హేమాద్రిచిదంబర దీక్షితులు, భరత నాట్యంలో ప్రావీణ్యులు శ్రీ సప్పాసత్యనారాయణ, శ్రీ నిడిమర్తి సత్యనారాయణ, పెద్దింటి నారాయణమూర్తి, శ్రీమతి కోటిరత్నం, సత్యవతి, స్వర్గీయ జనార్థనకుమార్, స్వర్గీయ సర్పరాజా. ఆలయ సాంప్రదాయ నృత్యాలలో ప్రత్యేక పరిశీలనజేసి ఆలయ ఆగమనృత్య ప్రచారం చేస్తూ ప్రాచీన నాట్యకళల ఔన్నత్యాన్ని చాటి చెబుతున్న శ్రీ సప్పాదుర్గాప్రసాద్ వంటి ఎందరో నాట్యాచార్యులు ఈ నగర నాట్య కళావైభవాన్ని చాటి చెబుతున్నారు. ఎందరో, ఎందరెందరో నృత్య కళాకారులను తయారు చేస్తున్నారు.

రాణ్మహేంద్రవరానికి ఒక ప్రత్యేక స్థానాన్ని భారతదేశంలో ఆపాదించి

రాష్ట్రపతి ప్రశంశలు పొందిన కళాకారులు ఈ నగరంలో ముగ్గురున్నారు. తొలి రాష్ట్రపతి బాబూరాజేంద్ర ప్రసాద్ వద్ద నృత్యం ప్రదర్శించిన నాట్యకళాకారుడు శ్రీ నప్పా సత్యనారాయణ, శ్రీ జ్ఞాని జైల్ సింగ్ వద్ద ఆంధ్రనాట్యం ప్రదర్శించినది పతివాడ రాధిక అయితే అనేక నాట్య గ్రంధాలు రచించి చిన్నతనం లోనే మంచి నాట్యాచార్యునిగా, భారతరాష్ట్రపతి ఉపరాష్ట్రపతి ప్రశంశలు పొందినాడు శ్రీ నప్పాదుర్గా ప్రసాద్.

ఇక ఈ నగరానికి మరొక ప్రత్యేకస్థానాన్ని ఆపాదించిన వారు ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన శ్రీ నటరాజ రామకృష్ణగారు. ఆయనకు ఈ తీరంలోని నాట్యకళావైభవం పూర్తిగా తెలుసు. ఇక్కడి అభినయ సాంప్రదాయమే ఆయనను ప్రపంచంలోనే మొదటి వ్యక్తిగా నాట్యరంగాన నిలిపింది. అందుకే అంతరించిపోతున్న సాంప్రదాయ స్త్రీల నృత్యాన్ని అభివృద్ధి చేయాలనే సంకల్పంతో ఆంధ్రదేశంలో అనేక రాజాస్థానాలలో ఆలయాలలో నర్తించిన వృద్ధులయిన కళాకారిణులందరినీ సమావేశపరచి సదస్సులు నిర్వహించి వారి అభీష్టం మేరకు ప్రాచీన సాంప్రదాయనృత్యానికి నూతన నామధేయం పెట్టారు. అదే 'ఆంధ్రనాట్యం'. ఈనాడు భారతావనిలో అభినయానికి, పదవిన్యాసానికి పెట్టింది పేరుగా ఆంధ్రుల కీర్తిని ప్రపంచంలో చాటిచెబుతున్న "ఆంధ్రనాట్యం"కు నామకరణోత్సవం జరిగింది ఈ రాజమహేంద్రవరంలోనే.

ఈ నగరంలో ఎందరో ఎందరెందరో నాట్యకళాకారిణులు నాట్యం అభ్యసించి ప్రసిద్ధిపొందారు. వారందరి గూర్చి వివరించాలంటే ఒక గ్రంథం అవుతోంది. అంతేగాక ఆంధ్రదేశ నాట్యకళా చరిత్రలో కొన్ని వందల సంవత్సరాల తరువాత నూటొక్కమంది నృత్యకళాకారులతో, నూటొక్క నృత్యజ్యోతులు, లక్షనొక్క పుష్పాలు నాట్యాధి దేవునికి సమర్పిస్తూ "నృత్యయజ్ఞం" దిగ్విజయంగా జరిగిందీ పట్టణంలోనే.

కళాదర్బార్, కళాజ్యోతి, కళాశ్రవంతి వంటి ఎన్నో సాంస్కృతిక సంస్థలకు నిలయం ఈ రాజమహేంద్రవరం. అందుకే ఎంతటి కళాకారుడయినా జీవితంలో ఒక్కసారయినా రాజమహేంద్రవరంలో నృత్యం చేయాలని

ఇక్కడి పండితుల దీవెనలు అందుకోవాలని ఆకాంక్షిస్తాడు. నాట్యకళా రంగాన ప్రత్యేక స్థానం ఈ నగరానికి ఉంది. అందుకే ఇది రాణ్మహేంద్ర వరం కళా సాంస్కృతిక కేంద్రాల పరం. ఈ నగరంలో పుట్టడమే ఒకవరం.

## గోదారి గలగలలో జానపదనృత్యం :

ఇక జానపద నృత్యరూపాల విషయానికివస్తే గోదావరి తీరం జానపద కళారూపాలకు, జానపద సాహిత్యానికి జానపద నృత్యాలకు పెట్టని కోట.

దేవాలయాలలో, రాజాస్థానాలలో, పండితసభల్లో, శుభకార్యాలలో శాస్త్రీయ నృత్యం స్థానాన్ని సంపాదించుకొంటే మానవుని దైనందిన జీవితంలోనే జానపదనృత్యం ఒక భాగం అయ్యిం జనులు పాడుకొనే పదం అదే జాన పదం. సాధారణ కుటుంబాలలో నాటికీ పెండ్లికి ముందు వీరభద్రుని సంబరం అంటూ ఒక తతంగం ఉంది. ఆ తతంగంలో నృత్యం తప్పని సరి. ఈ పూజా విధానం అంతా నృత్యం తోనే సాగుతుంది. పూర్వం కాకతీయుల కాలంలో వీరశైవంవ్యాప్తి చెందింది వీరశైవంలో నాట్యాధి దేవుడయిన శివుణ్ణి రుద్రునిగా, వీరభద్రునిగా ఆరాధిస్తారు. రుద్రుడై ప్రళయ భయంకరంగా శివుడు తాండవం చేశాండు. దక్షుని గర్వమణచేందుకు. అందుకే వీరశైవులు రుద్రతాండవాన్ని ఆడి ఆ ఆవేశంలో తమ కుత్తుకలు కత్తిరించుకొని శివసాన్నిధ్యం చేరేవారు. ఆసాంప్రదాయ లక్షణాలే ఈ వీరభద్ర సంబంరంలో కన్పిస్తాయి. ఉద్వృతంగా వీరణం, తాసావంటి వాయిద్యాలు మ్రోగుతుంటే చేతిలో కత్తిగానీ, బెత్తంగానీ దరించి కొందరూ, నోటిలోనూ నెదీపపుగుత్తులు ధరించి కొందరూ వీరావేశంలో ధక్షయాగం కేగి శరభశరభా ధక్షుని మధమణిచి అశ్శరభశరభా అంటూ గానం చేస్తూ - నర్తిస్తారు. ఈ సాంప్రదాయం ఈనాటికీ సజీవంగా ఉంది.

ఇక గరగలు. పల్లెలలో గ్రామ శక్తులయిన అమ్మవార్లకు జాతర ఉత్సవాలు జరుగుతాయి. నెత్తిమీద లోహపు బిందే దానికిచీర చుట్టి అమ్మవారిని నిలబెట్టి కొందరూ, సుమారు మూడు నుండి నాలుగు అడుగుల ఎత్తు గలిగిన

పూల గరగను ధరించి కొందరూ డప్పుల వాయిద్యానికి అణుగుణంగా నర్తిస్తూ చిత్ర విచిత్ర గతులలో పాదాలు పలికిస్తూ- చేతులు త్రిప్పుతూ నర్తిస్తారు. ఈ సాంప్రదాయం కూడా ఈ నాటికీ సజీవంగా దర్శనమిస్తుంది.

ఇక కోలాటం – కిటతక నెయ్యాకు తాధిమితాం

కిటతక తై కిటతకతై అంటూ- గుంపులు, గుంపులుగా రెండు చేతులలో కర్రలు పట్టుకొని తాళానికి అణుగుణంగా కర్రలు వాయిస్తూ – కీర్తనలుగానం చేస్తూ – వృత్తాకారంలో నర్తిస్తూ భ్రమణనర్తనరీతులలో నర్తిస్తూ – సుమారు 20 నుండి 30 మంది కళాకారులు ఈ కోలాటనర్తనాన్ని నర్తిస్తూ ఉంటారు.

ఇక గొబ్బిళ్ళు – గోదావరి తీరాన గొబ్బిళ్ళు ఒక అద్భుతమయిన జానపద సాంప్రదాయనృత్యం. సంక్రాంతి పర్వదినాలలో ప్రతి యింట్లోనూ కన్నెలు, పిల్లలు నర్తిస్తూ పాటలు పాడుతూ రకరకాల పదవిన్యాసాలతో చప్పట్లు చరుస్తూ నర్తిస్తారు. ఈ నృత్యం తెలంగాణాలో బతకమ్మగా కేరళలో ఓణం పండుగగా ఇంకా అనేక రాష్ట్రాలలో బహుళ ప్రచారం పొంది సజీవంగా నిలిచి ఉండడం విశేషం. ఇవేగాక తప్పెటగుళ్ళూ – తాసాలు, తోలుబొమ్మలాట, చిందులు గురవయ్యలు, పగటి వేషాలు, కోయనృత్యాలు, కొండనృత్యాలు లంబాడి, పాముకృత్యం, నెమలినృత్యం, సేవానృత్యం, బుర్రకథ, ఒగ్గుకథ, ఇలాఎన్నో, ఎన్నెన్నో జానపద నృత్య కళారూపాలు జనజీవనంలో ఒక భాగంగా మనిషితోపాటుగా పుట్టి, మనిషితో పాటుగా పెరిగి, మనిషి చనిపోయినా తాను మాత్రం జీవంతో జాతి ఔన్నత్యాన్ని చాటి చెబుతున్నాయి ఈ జానపద కళారూపాలు.

అందుకే జాతి యొక్క ఔన్నత్యాన్ని చాటేవి జానపద కళారూపాలే. మనిషికి మానసిక ఆనందాన్ని ఇస్తూ, మానసిక వికాశాన్ని పెంపొందింప జేసేవికళలే. కళలన్నింటిలో ముఖ్యమయింది. నృత్యకళ. కారణం.

దీనిలో – సాహిత్యకళ, శిల్ప కళ, సంగీతం, రూపశిల్పం, వాయిద్యం ఇలా దశవిధ కళారూపాల అపూర్వసంగమం నాట్యం. అందుకే ఇది జనరంజకం

అయ్యింది.

ఎంతటి ఖరినుడయినా, పాషాణ హృదయుడయినా సాత్వికునిగా మార్చి ఆనందింపచేసేది నృత్యకళ. నృత్యంలో అగ్రతాంబూలం ఈ గోదావరి తీరవాసులదే. అందుకే ఎందరో మాహానుభావులు ఈ తీరంలోనే జన్మిస్తే, ఇంకెందరో మహానుభావులు మరోజన్మంటూ ఉంటే ఈతీరంలో జన్మించాలని కోరుకుంటారు. అందుకే ఇది పుణ్యతీరం. గోదావరి గాలి తగులగానే కళాభిరుచి కల్గుతుంది. గోదావరి నీరు త్రాగగానే కళాబీజం మొలకెత్తుతుంది. దానికి సాధన జోడించిన వాడు కళాకారుడు.

సాధ్యపడనివాడు కళాభిమాని అవుతారీ తీరంలో. అందుకే ఓ గోదావరి మాతా అందుకో వందనం కళాభివందనం.

# దామెర్ల ఆర్టుగేలరీ

టేకి. మృత్యుంజయరావు, B.F.A

పవిత్ర గోదావరీ తీరాన మహత్తర సంస్కృతీ సాంప్రదాయాలకు నిలయమైన రాజమహేంద్రిలో గోదావరీ రైల్వేస్టేషన్ ఎదురు వీధిలో దామెర్ల రామారావు చిత్రకళా కేంద్రం (దామెర్ల ఆర్ట్ గేలరీ) వుంది.

ఈ అపురూప వర్ణచిత్రాలు ఎవరి కుంచెనుండి వెలువడినవో గాని, దేశ విదేశ కళావేత్తలచే కొనియాడ బడుతూనే నేటికీ అజరామరమై నిత్య నూతనంగా ప్రకాశిస్తున్నవి. ఈ అపురూప కళాఖండాల సృష్టికర్త ఎవరో తెలుసుకుందామా మరి!

20వ శతాబ్దంలో భారతీయ చిత్ర కళా పునరుజ్జీవన కాలానికి చెందిన చిత్రకారుడు శ్రీ దామెర్ల రామారావు గారే ఈ అపురూప చిత్రకళా ఖండాల సృష్టికర్త. ఈయన 1897 వ సంవత్సరములో మార్చి 8వ తేదీన శ్రీ దామెర్ల వెంకటరమణగారు, లక్ష్మీదేవరమ్మ పుణ్యదంపతుల అనుంగుబిడ్డగా జన్మించారు శ్రీ రామారావు గారు 27 సంవత్సరముల చిన్న వయసునందే కీర్తి శేషులైనప్పటికీ, ఆ స్వల్పకాలములోనే హిందూదేశమునకు, అందునూ ఆంధ్రదేశమునకు ఎనలేని కీర్తి ప్రతిష్టలు సముపార్జించి పెట్టారు.

పువ్వు పుట్టగానే పరిమళించునట్లు ఈయన చిన్న తనములోనే కళాకారుని లక్షణాలుసాధించారు. ముఖ్యముగా 1. ఏకాగ్రత 2. నిశితపరిశీలనాశక్తి 3. రేఖా విన్యాసము 4. తాళమాత్రల యొక్క పరిజ్ఞానము 5. మానవ జంతు దేహ భంగిమలలో కొలతల పరిజ్ఞానము 6. భక్తి వేదాంత విజ్ఞానము 7. ఆత్మ సంయమనం మొదలగు ఆదర్శ కళాకారుల లక్షణములు శ్రీ రామారావు గారికి పుట్టుకతో వచ్చిన సంపద.

సుప్రసిద్ధ చిత్రకారులు ఏ.ఎస్. రామ్‌గారి డ్రామా థియేటర్ కర్టెన్ పెయింటింగ్స్‌కు ప్రభావితులైన శ్రీ రామారావుగారిని కీగో ఓ.జె కూల్డ్రే (రాజమండ్రి గవర్నమెంట్ కాలేజీ ప్రిన్సిపాల్) పై చదువులకు సర్ జె.జె. స్కూల్ ఆఫ్ ఆర్ట్స్, బొంబాయ్‌కు పంపారు. అక్కడ ఈయన ప్రతిభను

గుర్తించిన కళాశాల ప్రిన్సిపాల్ బరస్సుగారు ఈయనను అనేక విధముల గౌరవించిరి. 1918వ సం॥లో అజంతా, ఎల్లోరా, ఎలిఫెంటా, నాశిక్ గుహలు మొ॥న చిత్రకళాకేంద్ర స్థానములను సందర్శించారు. భవనగరము, ద్వారక మొదలుగా గల అనేక పట్టణములను ఒక గుజరాతీ మిత్రునితో దర్శించిరి. 1920 సం॥ల బొంబాయి నగరంలో జరిగిన చిత్రకళా ప్రదర్శనమున అనేక బహుమతులను పొందారు. ముఖ్యముగా లాండ్‌స్కేప్ చిత్రమునకు ఆయన ప్రధమ బహుమతి పొందిరి. ఆ సం॥లోనే గుజరాత్ రాష్ట్ర సందర్శనము చేయుచూ అహమ్మదాబాద్ నందు తను రచించిన చిత్రములన్నిటిని ప్రదర్శించి కొన్ని వేలరూపాయల విలువగల చిత్రములను అమ్మిరి. ఆయన భవనగరులో నున్నపుడు విశ్వకవి రవీంద్రనాధఠాగూర్ అచ్చటకు రాగా, రామారావు గారు పదినిమిషములలో ఠాగూర్ రూపమును చిత్రించి ఆయన కిచ్చెను. ఠాగూర్ గారతని హస్త నైపుణ్యమునకు ఆశ్చర్యచకితుడై త్వరలో ప్రపంచములో కెల్లా గొప్ప చిత్రకారుడవు కాగలవని దీవించెను. ఠాగూర్ ప్రశంసలందుకున్న ఆయన రూపచిత్రము గేలరీలో మనము ఈ నాటికీ చూడగలము. 1915వ సం॥లో రాజమండ్రి పట్టణములో ప్రముఖ చిత్రకారుడు కీ॥శే॥ ఆచార్య వరదా వెంకట రత్నం, చామకూర భాష్యకార్లు చామకూర సత్యనారాయణ, శ్రీ యమ్. ఎస్. ప్రకాశరావు గార్లతో ఫైన్ ఆర్టు సొసైటీ అను సంస్థను శ్రీ రామారావు గారు స్థాపించిరి.

1921 సం॥లో జగన్నాధము, భువనేశ్వరము,మొదలుగా గల క్షేత్రములను దర్శించెను. కలకత్తాలో గల బెంగాల్ కళాకేంద్ర స్థానమును పరిశీలించుటకు వెళ్ళి, కొన్ని రోజులు అక్కడే ఉండి అబినేంద్ర ఠాగూర్ గారిని, ప్రమోద కుమార చటోపాధ్యాయులను, మరి యితర సుప్రసిద్ధ చిత్రకారులను కలిసి వారి పద్ధతులను పరిశీలించారు. అప్పుడు కలకత్తాలో జరిగిన చిత్రకళా ప్రదర్శనమునందు తన చిత్రాలను ప్రదర్శించగా 'ఋష్యశృంగ బంధనము' అను చిత్రమునకు గవర్నరు జనరల్ బహుమతి లభించినది. 'గోదావరి సౌందర్యము' అను చిత్రమును నాటి వైస్రాయ్‌రీడింగు ప్రభువు అప్పుడే మూల్యము చెల్లించి సొంతము చేసుకొనెను.

ఆయన బెంగాల్ వంటి రాష్ట్రములను సందర్శించిన మీదట 1922 సం॥లో రాజమండ్రిలో ఆంధ్ర భారతీయ చిత్ర కళాపరిషత్ స్థాపించి మన ప్రాంతములో కూడా గొప్ప చిత్రకారులను తయారు చేయవలెననెడి ఉద్దేశ్యముతో ఒక ప్రక్క హైందవ పురాణేతి హాసిక సాంప్రదాయ సాంస్కృతిక శైలిలో తాను చిత్ర రచనలు చేస్తూ, ప్రకృతి చిత్రాలు చిత్రిస్తూ మరొక ప్రక్క మరికొందరు చిత్రకారులను ఆంధ్రదేశమునకు అందించుటకు కృషిచేశారు. ఒక జ్యోతి ద్వారా అనేక జ్యోతులను వెలిగించగలిగినట్లుగా శ్రీ రామారావు గారి వద్ద తన ప్రియమిత్రుడు శ్రీ వరదావెంకటరత్నం గారు, భార్య శ్రీమతి సత్యవాణిగారు, సోదరి శ్రీమతి బుచ్చికృష్ణమ్మగారు, భార్య శ్రీమతి సత్యవాణిగారు, సోదరి శ్రీమతి బుచ్చికృష్ణమ్మగారు, శ్రీ చామకూర సత్యనారాయణ, సుప్రసిద్ధ లాండ్‌స్కేప్ ఆర్టిస్టు శ్రీ వరహాగిరి వెంకట భగీరధి గారు మొ॥న వారు ఆయన శిష్యులైరి. చిత్రకళను భారతీయ పద్ధతిలో ఆంధ్రుల నాగరికత, ఆచార వ్యవహార సాంప్రదాయము, జీవన విధానము ప్రతిబింబించునట్లుగా చిత్రించి చిత్ర కళకు వన్నె చేకూర్చిరి.

అజంతా, ఎలిఫెంటా, అమరావతి, లేపాక్షి శిల్పశైలిలను వీరి కుంచె కొంచెము అనుకరించినదని చెప్పవచ్చు. ఎందుచేతననగా బొంబాయి ప్రదర్శనములో మెప్పునొంది, ఇంగ్లాండు దేశములో 'వెంబ్లీ' నగర కళానిపుణులచే 'భళీ' అనిపించుకుని, కెనడా దేశపు కళా విమర్శకుల కోరికపై అమెరికా ఖండములోని టొరొంటో నగరమునకు పంపబడి అంతర్జాతీయ బహుమతి పొందిన, ప్రపంచ ప్రఖ్యాతి నొందిన, ప్రస్తుతము ఆర్టుగేలరీలో కనువిందు కలిగించుచున్న చిత్ర రాజ్యము 'సిద్ధార్థ రాగోదయము'ను చూసినచో అజంతా చిత్రశైలి సంపూర్ణ సౌందర్యముగా ద్యోతకము కాగలదు.

తైలవర్ణ చిత్రాలు అనూహ్యమైన రీతిలో సృష్టిస్తున్న సమయంలో ఘోరమైన మాశూచివ్యాధి శ్రీ రామారావు గార్ని 1925 ఫిబ్రవరి 6వ తేదీన పొట్టన పెట్టుకుని ఆంధ్ర చిత్ర కళా రంగానికి తీరని విఘాతమేర్పరిచింది. ఆయన ఆశయాలకనుగుణంగా శ్రీ ఆచార్య వరదా వెంకటరత్నం గారే సంస్థను నడుపసాగిరి. ఆ తరువాత కీ॥శే న్యాపతి సుబ్బారావు పంతులుగారు

ప్రపంచ ఖ్యాతినార్జించిన రామారావు గారి జ్ఞాపకార్ధమై ఒక చిత్రకళా మందిరమును రాజమండ్రిలో నెలకొల్పవలెనని తీర్మానించగా 1925 సం||లో దామెర్ల రామారావుగారి అన్న గారైన దామెర్ల వెంకట రావుగారి యింటిలో దామెర్ల రామారావుగారి చిత్రకళామందిరము మరియు చిత్రకళా పాఠశాలను ప్రారంభించిరి. ఆనాడు రామారావు గారి కళాఖండములను దర్శించి మహాత్మగాంధీ పులకిత హృదయులైరి.

18-7-1925న దేశభక్త కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు గారు వంటి సభ్యులతో కూడిన సంఘము కీ||శే|| విస్సా అప్పారావుగారు కార్యదర్శి మరియు కోశాధికారిగానూ, వరదవెంకటరత్నంగారిని ఆచార్యుని గాను ఎన్నుకొనిరి. ఆ సభ్యులందరూ రామారావు స్మారక సంస్థకు "దామెర్ల రామారావు మెమోరియల్ ఆర్ట్‌గేలరీ అండ్ స్కూల్" పేర రిజిస్ట్రేషన్ చేయించిరి. ఆ తరువాత 1957 వ సం|న నూతన భవనము స్థాపించబడినది. శ్రీ వరదా వెంకటరత్నం గారు తనువు చాలించిన తరువాత ఆయన ప్రియశిష్యులు శ్రీయుతులు మాదేటి రాజాజీగారు ఆచార్య పదవినలంకరించిరి. ఆయన హయాంలో ఆర్ట్ గేలరీ ఇంతకంటే ఉన్నతిని, అభివృద్ధి చెందగలదనే ఆశతో 1970 లో సాంకేతిక విద్యాశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారికి సమర్పించడమైనది.

కీర్తి శేషులు దామెర్ల రామారావు గారు మనముందు లేనప్పటికినీ ఆయన చిత్రించిన చిత్రములలో సజీవులై యున్నారు. అని ఆ అపురూప కళాఖండములను చూచినచో మనకు తెలియును. ఆ అద్భుత చిత్రరాజముల సౌందర్యమును వర్ణించుట ఎవరికినీ శక్యముకాదు. వాటిని దర్శించిన నేత్రాలకు ఆ చిత్రాలు శాశ్వతముగా స్మృతి పధము నందు నిలవగలవు. స్థాలీపులాక న్యాయముగా కొన్ని కళాఖండముల గూర్చి వ్రాయుచున్నాను.

### 1. శ్రీరామ వనవాసము :-

భారతీయ చిత్రకళలో తాత్త్విక సౌందర్యముట్టి పడుతుంది. చిత్రకారుడు తాను ఒక లోకమునునిర్మించుకుని విహరించు శక్తి సామర్థ్యములను గలిగిన

బ్రహ్మవంటి వాడు. ఈ సాధనంలో భౌతికమైన ఈ లోకమును విడచి ఆధ్యాత్మిక చింతన ద్వారా చిత్రకళా సాధనలో సచ్చిదానంద మయుడైన పరమాత్మతో ఐక్యాన్ని పొందుటకు అవకాశమున్నది. మనస్సులో ఉద్భవించిన భావమును కుంచెద్వారా "కాన్ వ్యాస్' పై మరియు కాగితముపై ప్రతిబింబింప చేయుట ఉత్తమ కళాకారుని లక్షణం

శోకతప్తుడైన దశరధుడు ఈ భౌతిక ప్రపంచమును మరచిహతాశు డై యుండు స్థితిని ఈ చిత్రము నందు చూడవచ్చును. కుమారుని వీడ లేని తల్లి కౌశల్యగుండె పగిలి నేలపై ద్రొల్లుట; హృదయా వేదనను అణచుకోలేక చెలికత్తె భుజముపై శిరమువంచి విలపించు తల్లి సుమిత్ర; కైక హేలగ తన వాంఛ ఈడేరెనని సోయగముగ సంతసించుట; తండ్రి వాక్యము పాలించు భాగ్యము తన కబ్బెనని రాజ్యము, వనము తనదృష్టిలో ఒక్కటేనని భావించు ధీరుడైన రాముడు; పతితోడే తన సర్వస్వమని అనుసరించుసీత; అన్నయే పరమాత్మ అనిసేవా కైంకర్యుడైన లక్ష్మణుడు ఈ చిత్రమున గోచరించి జగన్నాటకము యొక్క హేల ప్రస్ఫుటముకాగలదు.

## 2. కార్తీక పౌర్ణమిః–

భారతదేశము కళలకు కాణాచి, ఆంధ్రదేశము చిత్రకళకు పట్టు గొమ్మ అనాదిగా భారతీయులు భక్తి శ్రద్ధలతో జరుపుకొను పండుగ కార్తీక పౌర్ణమి. ఆనాడు ఈనాడు ముఖ్యముగా స్త్రీలు తమ పసుపు కుంకుమలు కలకాలము నిలుపుకొనుటకై పార్వతీ పరమేశ్వరులను ఆరాధించు దృశ్యమే ఈ కార్తీక పౌర్ణ విచిత్ర వైశిష్ట్యత.

ఈ చిత్రమును బాగుగా పరిశీలించినచో భారతీయ ఆధ్యాత్మికతకు గల వైశిష్ట్యము గోచరమవుతుంది సాంప్రదాయ సిద్ధమైన స్త్రీల వస్త్రధారణ, పూజాసామగ్రి, వేద ఘోషలు, తగినరంగుల వేళవింపు కనుల ముందు ఆ దృశ్యమును సాక్షాత్కరింపజేసి ఒక్కసారి గుడిలో ఉన్నామా అనే భావనను కలుగ జేస్తుంది. ఒక భారతీయులే కాదు దేశవిదేశాల వారు కూడా ఆదరించి మొచ్చిన చిత్రమే ఈ కార్తీక పౌర్ణమి.

### 3. సీమంతం :-

1923 సం॥లో శ్రీ దామెర్ల రామారావు గారు చిత్రించిన అసాధారణ అత్యద్భుత చిత్రమే ఈ 'పుష్పాలంకరణ' (పువ్వుల ముడుపు). ఇది ఆంధ్రప్రదేశంలో తమ ఇంటి ఆడపడుచులకు తొలికాన్పుకు ముందు చేయు సంబరం ముత్తైదువుల సమక్షమున జరుపు మచ్చటైన వేడుకను ఆయన భార్యకు జరిగిన సీమంతమును కనులారాగాంచి పరవశించి ఆ సంఘటనకు శాశ్వత స్వరూపమునుతన రచనా పాటవముతో నొసంగెను. ఆనాటి శ్రీమతి సత్యవాణిగారి వేడుకను ఈ నాటికి మనము చూడగల్గుతున్నాము. రూపు రేఖా విలాసాలను, ఆనాటి స్త్రీలకు తగిన వస్త్రధారణా విధానమును, పేరంటాలకు జరుగు పన్నీటి జల్లులు, అమ్మలక్కల కాలక్షేపపు ముచ్చట్లు, కూర్చునే వివిధ పద్ధతులు ఇటువంటి ఎన్నో విశేషాలు ఈ చిత్రము ద్వారా మనకు గోచరమవుతాయి. ఇదే ఆయన చిత్రీకరణ యందుగల మహత్.

### 4. నూతివద్ద :-

ఆంధ్ర గ్రామీణ వాతావరణ చిత్రీకరణ ఈ చిత్రమున గలదు. గ్రామాలలో గల ఊరుమ్మడి మంచి నీటి గిలక బావుల వద్ద ఓ ఉదయపు దృశ్యాన్ని ఆయన కుంచెద్వారా మనకు అద్దము పట్టినట్లు చూపిరి. బావులవద్ద ఆనాటిస్త్రీలు చేదతో నీటిని తోడె వయ్యారాలు, నీటి బిందెలు ఎత్తుకొని నడిచి వెళ్ళెడి స్త్రీల సౌందర్యము, చేదకోసం వేచి నిలబడియున్న స్త్రీల లావణ్యం, బిందెలను నెత్తిన ఎత్తుకొని వెళ్ళెడి స్త్రీల నడవడిక నిలుచునే విధానము, బిందెలు భుజాన పెట్టుకున్న స్త్రీల సహజత్వం, వివిధ వ్యక్తుల వివిధ భంగిమల కూర్పు, ఆనాటి స్త్రీల వస్త్ర ధారణా విధానమున చూపిన సహజత్వం, ఆనూతివెనుక ప్రకృతి యొక్క దివ్యత్వం, చూచిన కన్నులకు రసానందము కల్గించు ద్వియ కళా సృష్టి ఈ చిత్రము, విశ్వవిఖ్యాత చిత్రకారులతో సరితూగగల ప్రతిభ, నైపుణ్యం దామెర్ల గారిదని నిరూపించెడి చిత్రమిది.

## 5. కతియవాడి (గొల్లభామలు)

ఇది గుజరాతీ యొక్క కతియవాడ గ్రామీణ స్త్రీలు ముగ్వురు పాలకడవలను శిరస్సున ధరించి నగరానికి పాలవిక్రయానికి వెళుచున్న సందర్భమును చూపునది.

ఈ చిత్రములో విశేషము ఏమనగా ఇందు స్త్రీలవస్త్ర ధారణ గుజరాతీ పద్ధతులను చూపునది. అద్దమును అతికించి అల్లిన అల్లిక వస్త్రమునులను ధరిచుట యందు, అలంకరణ యందును ఈ వైవిధ్యము మనకు కానవచ్చును. చేతులకు కొమ్ముగాజులు అలంకరించుకొని ముగ్వురు స్త్రీలు నెత్తిన కడవలను మోయుచు నిశ్చలమైన మనసుతో ఒకరితో నొకరు మాట్లాడుకుంటూ, సేవా హృదయముతో ఆపాలకడవలు పట్టణమున తమ కోసం ఎదురు చూచెడి వారికిచ్చుటకు కార్యోన్ముఖులై వెళ్ళుట కనిపించును.

ఇందులో ప్రధానముగా గ్రౌండ్ లైన్‌కు దగ్గరగా ఉన్న స్త్రీ దేహనిర్మితిని చిత్రించుట యందును, మనిషి వయ్యారము నందునూ, నడుచు నప్పుడు పాదముల మధ్యగల వ్యత్యాసము, వస్త్ర రచనలో ఆప్రాంత సాంప్రదాయము, వారి అలంకరణ విధానములను చూపుట యందునూ ఆయన సునిశిత పరిశీలనా దృష్టి ఈ చిత్రము ద్వారా మనకు తెలియనగును.

## 6. ప్రకృతి దృశ్యములు :-

ప్రకృతిని ఇతరులు చూచుట వేరు, చిత్రకారులు చూచుట వేరు. చిత్రకారుడు తన దృష్టికి గోచరించిన ప్రకృతిని రమ్యంగా చిత్రిస్తాడు కనుకనే అందాలకు అందాలనద్ది ప్రకృతి రమణీయతను ఆహ్లాదకరముగ చిత్రించి తన కుంచెతో హృదయాలను కదిలించగల శక్తి ఈ చిత్రకారునికే కలదని నిరూపించెడి చిత్రములను ఈయన కుంచె వెలువరించినది.

క్రిందటి శథాబ్దములో జీవించిన సుప్రసిద్ధ పాశ్చాత్యచిత్ర కారులు కానిస్టేబుల్, టర్నర్ లు ప్రకృతి చిత్రరచనలో ప్రసిద్ధులు. వీరిలో ఒకరు స్థల చిత్రకారులైతే మరొకరు వాతావరణ చిత్రకారులు. అట్లే స్థల వాతావరణ, సాగరతీర చిత్రాలు చిత్రించుటలో ప్రఖ్యాతులు మన రామారావు గారని

చెప్పుట ముదావహము.

చిత్రకారునికి ఋతు పరిజ్ఞానమెంతో అవసరము. ప్రకృతి చిత్రాలలో సెలయేరుల చిత్రీకరణకు ఎంతో ప్రాధాన్యత ఉంది, దూరపుకొండల నుండి అతిదగ్గరగా గల చిన్న రాయివరకు గల మధ్యదూరమును చిత్రించుటలో చిత్రకారుని నేర్పు బయట పడుతుంది. రామారావు గారు చిత్రించిన చిత్రాలను మనము బాగుగా పరిశీలించినచో పై విషయములు స్పష్టముగా గోచరమవుతాయి.

సాంకేతిక పరిజ్ఞానము లేని రోజులలో ఆయన చిత్రించిన చిత్రాలు ఈనాటి మైక్రోఫోనిక్ లెన్సెస్, వైడ్ లెన్సెస్ ఉపయోగించి తీసిన ఫోటోలకు ఏ మాత్రం తీసిపోవని నిస్సందేహంగా చెప్పవచ్చును.

## 7. నగ్న చిత్రాలు :-

సౌందర్యం వ్యక్తి గతం గానీ, వస్తుగతం కాదు. కనుకనే ఒకరి దృష్టిలో సుందరమైనది మరొకరి దృష్టిలో సుందరమైనది కాకపోవచ్చును. సౌందర్యోపాసనలో కళాత్మకదృష్టితో స్త్రీని అనేక కోణములలో సమతుల్యం' రేఖానైపుణ్యంలోగాని, చీకటి వెలుగులు చూపడంలోగాని కళాకారుని ఔచిత్యము తెలియగలదు. లోకందృష్టిలో అసభ్యంగా గోచరించినప్పటికీ, రస పిపాసకుల దృష్టిలో మాత్రం కళాకారుడు సృష్టించిన ప్రతినగ్న చిత్రం, ఒక అసామాన్య కళా ఖండము అనే నగ్న సత్యాన్ని మనం గుర్తించే స్థితికి ఎదగాలి. ఒక విధముగా ఆలోచించినచో ప్రకృతిలో ప్రతివస్తువు, ప్రతిచెట్టూ, పశుపక్ష్యాదులు, పంచభూతాలు నగ్నంగానే మనకంటికి గోచరిస్తున్నవి వీనిని చూచి తన్మయం చెందే మానవుడు చిత్రకారుడు గీసిన నగ్న చిత్రాలను చూచి ఆనందించలేకపోవుచున్నాడు.

నగ్న చిత్రాల చిత్రీకరణలో శరీర అవయముల సౌష్టవ చిత్రీకరణయే ప్రధానంగా తీసుకోబడుతుంది. సంస్కృతాంధ్ర కవులు వర్ణించిన పద్మినీ జాతిస్త్రీల సౌందర్యమును రామారావుగారు కన్నులకు కట్టినట్లు చిత్రించారు. అన్ని కోణాలలోను నగ్నస్త్రీ చిత్రాలను సహజత్వమును, సౌందర్యమును వేలార్చునట్లుగా కళా తృష్ణతోను కళారాధనా భావముతో చిత్రించిరి.

ఇట్లే ఆయన కుంచె నుండి శర పరంపరలుగా వెలువడిన కళాఖండాలెన్నో దామెర్ల ఆర్ట్ గేలరీ నందు అలంకరించబడియున్నది ఆసిద్ధ హస్తుని వర్ణచిత్రాలే కాక పెన్సిల్ నుండి జాలువారిన చిత్రాలు కూడా అంతే స్థాయిలో మనకు ఆనందము కలిగించురీతిని చిత్రించబడినవి. అతి చిన్నవయస్సులోనే అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన ఆయన గావించిన సాధన ఎంతటిదో, అహర్నిశలూ సాగించిన శ్రమ, కృషి, పట్టుదలలు ఎటువంటివో మన ఊహకు అందనివి. ప్రతి ప్రాణికీ ఆవశ్యకమైన ఆహార నిధి సౌఖ్యాలను త్యజించి కేవలం మూడు పదుల జీవిత కాలములో ఆయన గావించిన సృష్టిలో ఉద్భవించిన చిత్రకళా ఖండాలు ఈనాటికీ ఈ గేలరీ నందు మనము సందర్శించవచ్చును.

గాలరీలో వీరి చిత్రాలే గాక ఇతర రాష్ట్ర ప్రముఖ చిత్రకారులైన శ్రీ ఆర్.డి. రావెల్, శ్రీ ములంగాంతర్, శ్రీ హెచ్.వి. మహారుద్రప్ప, శ్రీ భగవాన్ కపూర్, శ్రీ కె. రాజేంద్రన్ చిత్రాలు కూడా ప్రదర్శితమౌతున్నవి. ఆంధ్ర రాష్ట్రమునకు చెందిన సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ యస్.వి. రామారావు, శ్రీ వరదా వెంకటరత్నం, శ్రీ వి.వి. భగీరధి, శ్రీమతి దామెర్ల సత్యవాణి, శ్రీమతి దిగుమర్తి బుచ్చి కృష్ణమ్మ, శ్రీ ఎకెలీ సుబ్బారావు శ్రీ అంకాల వెంకట సుబ్బారావు, శ్రీ ప్రభాకరరావు, కళావిమర్శకులు డాక్టర్ సంజీవదేవ్, శ్రీ బి.వి. నరసింహారావు, శ్రీమతి బి కరుణారావు, శ్రీ కె.అంజయ్య శ్రీ అంట్యాకులపైడిరాజు, శ్రీ యస్. యన్. పట్నాయక్, శ్రీ మాదేటి రాజాజీ, శ్రీమతి నాగేశ్వరీ బాయ్, శ్రీ ఎ. అప్పారావు, శ్రీ కె పార్వతీశం, శ్రీ యమ్. సీతారామాచార్యులు తదితర చిత్రకారుల చిత్రాలు నేటికీ సందర్శకులను ఆశ్చర్య చకితులనుచేస్తూ, అజరామరమై అశేషజనవాహినిని ఆహ్లాద పరుస్తూ, భావి చిత్రకారులకు వెలుగు బాటగా స్ఫూర్తి నిస్తున్నవి. ఇటువంటి ప్రఖ్యాతినొందిన చిత్రాలు పరిరక్షింపబడి జాతీయ సంపదగా వెలుగొంద గలవని ఆశిద్దాము.

# కళలకు పుట్టినిల్లు రాజమహేంద్రవరం

**–పి. కృష్ణయ్య, ఐ.ఎ.యస్.**

రాజమండ్రి ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాల్ హూస్‌దొరగారు. ఆయన పర్యవేక్షణలో విద్యార్థుల చేత మర్చంట్ ఆఫ్ వెనిస్ కళాశాలలో ప్రదర్శింపజేశారు.

1889 నాటికి టంగుటూరు ప్రకాశం పంతులుగారు రాజమండ్రి చేరే నాటికి ఆంగ్లంలో షేక్స్ ఫియర్ నాటకాలు ఆడేవారు. ఇమ్మనేని హనుమంతరావు, టంగుటూరి ప్రకాశంపంతులు, చిలకమర్తి లక్ష్మీ నరశింహం, వడ్డాది సుబ్బారాయుడు మొదలగు మహానటులు 1990 వరకు తెలుగు నాటకాలు ప్రదర్శించారు. టంగుటూరు ప్రకాశంపంతులుగారు ఆడవేషాలు వేయడంలో ప్రసిద్ధిచెందారు.

తదుపరి కె. గున్నేశ్వరరావు, కృతివెంటి నాగేశ్వరరావు గున్నేశ్వరా నాటక సమాజం పేరు మీద క్రమ శిక్షణగల నాటకాలు ప్రదర్శించేవారు. అప్పటిలో పార్సీ కంపెనీవారు రావడం నేటి (వెంకటేశ్వర ఆనంకళాకేంద్రం) స్థలంలో డేరాలు బిగించి కురుక్షేత్రం, కీచక వధ, కృష్ణలీలలు, మాయాబజార్ నాటకాలు, గుర్రాలు, ఏనుగులు రప్పించి ప్రదర్శించేవారు. ఎక్కువగా ఈ నాటకాలు ట్రిక్ సీన్స్‌తో నడిచేవి. ప్రజల్ని ఆకట్టుకొనేవి.

1911 ప్రాంతంలో ముప్పిడి జగ్గరాజుగారు స్త్రీ పాత్రలో ఎక్కువగా రాణించేవారు. రాజమండ్రి నాటకాలలో బ్రహ్మజోస్యుల సుబ్బారావు, అంక రాజు శంకరావు, వెల్లంకి వెంకటేశ్వర్లు, బండరాముడు ప్రసిద్ధంగా వెలుగొందేరు. 1940–50 మధ్యలో రాజమండ్రి పట్టణంలో వీధి వీధిన నాటకాలు శ్రీరామనవమి, మిగతా ఉత్సవాలలో వివరంగా ఆడారు.

శ్రీయుతులు కొయ్యానితమ్మయ్య, కేతాకొండలయ్య, రొంగల మునలయ్య, పిల్లా అప్పలస్వామి, గొల్ల అప్పలస్వామి, ఆదినారాయణ కృష్ణవేణి (సినీనటి) వీరందరూ పట్టణాన్ని ఉర్రూతలూగించేవారు.

1950 సం॥లో లలిత కళానికేతన్ ద్వారా ఔత్సాహిక నాటకరంగం మూడు పువ్వులు ఆరుకాయలుగా విరాజిల్లింది. డా॥ గరికి పాటి రాజారావుగారి రాఘవ కళానిలయం అమోఘంగా నడిపారు. అదేవరవడిలో వీరవెంకన్న ఆర్ట్ థియేటర్స్, గురజాడ అప్పారావు ఆర్ట్స్, పొట్టి శ్రీరాములు ఆర్ట్స్, విశ్వకళా సమితి, ప్రజానాట్యమండలి, వీరేశలింగం ఆర్ట్స్ ఔత్సాహిక నాటక సమాజాలు చురుకుగా పనిచేశాయి.

అంకరాజు శంకరావు, డా॥ గరికి పాటి రాజారావు, బిడసినమెట్ల కొండలరావు, ద్రోణం రాజు చినకామేశ్వరరావు, కాపుగంటి రమణరావు, మేడూరి వీరవెంకన్న, శ్రీపాద పట్టాభి, నారాయణ, ఆకుల మాణిక్యాలరావు, పడాల రామారావు, పి.బి. వీరాచార్యులు, లోలుగా అప్పాజీ, కడియాల సోమరాజు, కొండపల్లి భాస్కరరావు, నీలపాల, ప్రసాదుల గురుమూర్తి, నాగేంద్రాజీ, సత్యశ్రీ లక్ష్మి, శాంత, మణికుమారి, నాగమణి రాజమండ్రి నాటకరంగంలో ఒక వెలుగు వెలిగారు

వేయి సంవత్సరాలుగ కీర్తి ప్రతిష్టలతో వెలుగొందుతున్న రాజమండ్రి వివిధ కళారంగాలలో ప్రతిష్ట పొందింది. నన్నపార్యుని భారత రచనా ప్రస్థావనలో ఆయనను భారత రచనకు శ్రీకారం చుట్టింపజేసిన రాజ రాజ నరేంద్రుడు "చూసితి బహుముఖ నాటకరీతులు" అన్నట్లు వ్రాయడం నాట్యనృత్యాధి దశలు వివిధ రూపాలు రాజరాజనరేంద్రుడెరుగునట్లుగా మనకు విశదమౌతుంది. రాజమహేంద్రవరం, పరిసర ప్రదేశాలలోను అనాదినుండి నాట్యకళకు, నాటకానికి మంచి ప్రోత్సాహం, ప్రోద్బలం వుంటూవుంది.

శ్రీరామాచారి, వేదాంతం లక్ష్మినారాయణ కుమారులు జగన్నాధ శర్మ, 'నర్తనశాల' పేరుతో నాట్యపాఠశాలను నిర్వహించారు. కె.యస్.రెడ్డి బి.వి. నరశింహారావు, శ్రీనివాస్, పశుమర్తి కృష్ణమూర్తి, శ్రీమతి పువ్వుల గోవిందమ్మ సిస్టర్స్ కళావరురాణి, కె.లక్ష్మణరెడ్డి, శ్రీ శైవా మొదలగువారు రాజమండ్రికి మంచి పేరు ప్రఖ్యాతులు సంతరించిపెట్టారు మణి సిస్టర్స్, గంధర్వనాట్యబృందం సరస్వతి నాట్యబృందం, వహీదారహమాన్, జరీనా

వహాబ్, జయప్రద, భానుప్రియ (ఈ సినీ నర్తకులు అందరూ రాజమండ్రివారే)

ఈనాడు కూచిపూడి నాట్యానికి తలమానికంగా వెలుగొందుతున్న కుమారి శోభానాయుడు కూడా రాజమండ్రినివాసియే. నాట్యరంగం ఇంత త్వరగా విస్తరించడానికి శ్రీ యుతులు లోలుగు అప్పాజీ, నార్ని కేదారేశ్వరుడు, దుర్గా రమణరావు, సప్పా సత్యన్నారాయణ, హేమాద్రి చిదంబర దీక్షితులు, నిడమర్తి సత్యం, సప్పా సత్యవతి, డి.కోటిరత్నం, పెద్దింటి నారాయణమూర్తి, సర్పరాజ్ పద్మప్రియ మొదలగు వారు మంచి కృషి జేశారు కళాకేంద్రంగా రాజమండ్రి పట్టణ ప్రజల హృదయాలలో సుస్థిరమైన గౌరవ మర్యాదలుగల ఈ పట్టణ కీర్తి ప్రతిష్టలు యింకా ఇనుమడింపజేసే కళాకారులు ఎందరో వున్నారు

బుర్రకథలు పేరు చెబితే నిడదవోలు అచ్యుత రామయ్యగారు గుర్తుకు రావలసిందే. అలాగే సుబ్బిరెడ్డి, సత్యం, విభూదివారి దళం తదితర బుర్రకథ దళాలు రాజమండ్రిలో ప్రసిద్ధి చెందినవి.

సంగీత కచేరీలు నిర్వహించడంలో త్యాగరాజుగానసభ, బుగ్గాపాపయ్యశాస్త్రి, శ్రీ ఎస్. వీరరాజులు గుర్తుకొస్తారు. మృదంగ విద్వాన్ కమలాకర్ రావుగారు రాజమండ్రికి మంచి పేరు తెచ్చినవారే. కళాదర్బార్, కళాజ్యోతి, కళా స్రవంతి, ఆంధ్ర శ్రీ కల్చరల్ అసోసియేషన్, కళావాణి, మయూరి కళాసమితి మొదలగు ఔత్సాహిక నాటక-నాట్యసంస్థలు రాజమహేంద్రి పట్టణాన కళారంగాన్ని తీర్చిదిద్దడంలో తమవంతు పాత్రలు అవి నిర్వహిస్తూనే ఉన్నాయి.